శ్రీ సద్గురవేనమః



# శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

మొదలక లక్షణంబను.

( ఐదవ సంచిక. )

ఇది

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే.

రచియింపబడి.

గుండా భూమయ్య గుప్తకార్య దర్శిగారిచే.

శ్రీహరిహర ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రకటింపంబడినది.

శ్రీ మద్గురవేనమః

వేద వేదాంతాతీత ద్వైతాద్వైతరహిత పరమ తత్వ మనందగు.

శక్తిద్వయ నిరాసకంబైన.

# శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక

మొరుక లక్షణంబను.

## ఐదవ సంచిక.

ఇది

శ్రీగోలకొండయనంబరగు దక్కన్ హైదరాబాద రాజధానియందు

పెద్దమహారాజగంజు నివాసులైన.

## శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే.

రచియింపంబడి.

సహాయ కార్యదర్శుల ప్రోత్సాహముచే

రాజవర్గమువారలయొక్కయు, పోషకులయొక్కయు, అభిమానుల

యొక్కయు చందా దారులయొక్కయు, ద్రవ్య సహాయముచే,

గారావర్షుల, రామకృష్ణ సచ్చిదానంద సద్గురుస్వామివారి ప్రియశిష్యుండగు

## గుండా భూమయ్యగుప్త కార్యదర్శిగారిచే

గుండా భూమన్న యీశ్వరయ్యగారి

శ్రీహరిహరముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపంబడియె,

సికింద్రాబాద్ దక్కన్.

శ్రీ శోభన నామ సం॥ వైశాఖ శు॥ ౧౫ సోమవారం

ది॥ ౧౨ మే ౧౯౦౩ సం॥

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు.

శా॥ శ్రీమత్కేసనవంశదీపకుఁడు స ౹ త్శీలుండు సదా వేంకట
స్వామీ నాగమదేవిగన్నసుతుఁడు ౹ సర్వజ్ఞుండు పూర్ణుండు శ్రీ
భూమానందులహానుమార్యపదముల్ ౹ పూజించు భక్తుండు సూ
వేమారుల్ గొనియాడగా వశమె నీ ౹ వీరయ్యధీరుణ్ణిలన్ ॥

శ్లో॥ పరిపూర్ణభావసిద్ధాంతం । సన్మార్గంచప్రవర్తనం ।
భక్తాశ్రయంచవాగ్దాం । వీరయార్యనమామ్యహం ॥



శ్లో॥ శ్రీకేసనాన్వయాంబోధి । పూర్ణచంద్రసుధాకరం ।
నిర్మలానందయోగీంద్రం । వీరయార్యనమామ్యహం ॥

# శ్రీ నిర్మలానంద కేసన వీరయార్య రాజయోగిగారు.

చం॥ వరరమణీయచిన్నపుర వాసుఁడు శాంతగుణోజ్జ్వలాదరం ।
ధరుఁడు మహాశయుండు సర ధారుణికల్పకుఁ డయ్యమానుసాధుస
త్పురుషసుపూజితుండచల పూర్ణుఁడు శిష్యులపాలివేల్పు శ్రీ ।
గురుపదతీర్థ మెల్లపుడు గ్రోలెడు కేసనవీరయార్యులున్ ॥

శ్రీ గురుభ్యోనమః

శ్రీమద్భాగవత కృష్ణదేశిక విరచిత శక్తిద్వయ నిరాసకంబైన,

# శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

( మెరుకలక్షణం )

* కందార్థము. *

గీ౧ * వొకదేహధారితనువున * సకలావస్థలుజనించి * చనినవిధమున౯ *
అకలంకమైనబయలులో * ప్రకటంబైలేనిమెరుక * బయలుండజూచీ * తనముచ్చట
పరికించిలేచీ * వొకకొంతశ్రేపైన వుండేటందుకులేక * సకలాముతనవెంట జనుదేర
జనుబట్టి * బయలుండజూచి * తనముచ్చటపరికించిలేచీ॥ * * *

(*) భద్రాద్రిరామశతకము. (*)

(* జాగ్రదవస్థ. *)

సీ॥ పంచవింశతితత్వ పరిపూర్ణమైనట్టి ♦ స్థూలదేహమునందు సురచిరముగ
రవస్పర్శలునురూప రసగంధవచనదా ♦ నగమనోత్సర్జనా నందములును
మానసాహంకార మనుచిత్తములగూడి ♦ జీవుండుముఖమున జేరినిలచి
విశ్వనామము జెంది వేర్వేరవిభజించి ♦ సకలవ్యాపారముల్ సలుపుచుండు

౨ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

గీ॥ నదియుజాగ్రిదవస్థయు ననుదినంబు ♦ జనితమైజనుచుండును జన్మరహిత
రమ్యగుణధామ భద్రాద్రిరామపరశు ♦ రామనరసింహదాససంరక్షితాంహ్వ॥

* భా వా ర్థ ము. *

౨౨ జీవుడు పంచవింశతి తత్వాత్మకమైన తనువునుగూడి చతుర్దశేంద్రియ విషయము లనుభవిస్తూ నేత్రస్థానమందు విశ్వుడనేపేర నిలచి సకల వ్యవహార ములు జేయుచుండును.

(* స్వ ప్నా వ స్థ *)

సీ॥ శబ్దాదివిషయ పంచకముపాగాది ♦ పంచకముసీపదియు నిచ్చటనునిల్పి
మానసహంకారమతి చిత్తములగూడి ♦ సప్తదశకతత్వ సంజ్ఞసూక్ష్మ
దేహమందునకంఠ దేశంబునను జేరి ♦ నిలిచికొంచెముసేపు నిదురజెంది
జాగ్రతయందుతా జరిపినట్లుగక్రియల్ ♦ జేసిమేల్కొనిచూడ లేశమైన
గీ॥ లేదుగనుకను స్వప్నంబనాదిపురుష ♦ సత్యమిదిగాదు జనితమై జనుచునుండు
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు ♦ రామనరసింహదాస సంరక్షితాంహ్వ॥

* భా వా ర్థ ము *

౨౩ జీవుడు దశేంద్రియ విషయములను స్థూలమందుంచి పంచప్రాణమనో బుద్ధి దశేంద్రియ సమన్వితమైన (౧౭) తత్వములను సూక్ష్మ తనువునుగూడి, కంఠమందు తైజసుడనే పేరున నిలచి జాగ్రతవ్యవహార క్రియలు చేయుచునుం డును. ఇదియే స్వప్నావస్థ. మేలుకొనిచూడగా యేమియు లేదు. గనుక యిది సత్యముగాదు.

(* సు షు ప్త్య వ స్థ. *)

॥ కంఠదేశమునహంకారచిత్తములుంచి ♦ ధీమనంబులరెంటి దీసుకొనియు
కారణదేహాహృత్కమలమందున జేరి ♦ యజ్ఞానసన్నిధి యందునిలిచి
నదిసుషుప్త్యనబడు నచటరెంటినినుంచి ♦ తానవిద్యనుగూడి లీనమైన

నదియుగాఢాసుషుప్త్యనబడు మహిమీఁద ♦ సర్పంబు బారిన స్మరణదప్పి
గీ॥ యుండుతుర్యంబటంచును యోగివరులు ♦ చాటుచుందురు జనితమైజనుచునుండు
రమ్యగుణధామ భద్రాద్రిరామపరశు ♦ రామనరసింహదాస సంరక్షితాంహ్వ॥

౨౮ జీవుడు అహంకార చిత్తములను కంఠమందుంచి, మనోబుద్ధుల దీసికొని, కారణదేహముయొక్క హృత్కమలమందు జేరి, అజ్ఞాన సన్నిధియందు నిలిచి, ప్రాజ్ఞుడనెడి పేరనుండును, ఇదియేసుషుప్త్యవస్థ. జీవుడు మనోబుద్ధులవిడిచి, అవిద్యనుగూడి లీనమై మూర్ధ్నియందు ప్రత్యగాత్మయనే పేరను నిలచియుండు ఇదియే తుర్యావస్థ. శరీరంమీద సర్పము బారినను, స్మృతి దప్పియుండును.

(వేదాంతమంజరి.)

* ద్విపద *

యీసృష్టికన్న మున్నేకస్వరూప । మైసచ్చిదానంద మైయాత్మవెలుగు
ఆమహాపరతత్త్వ మాద్యంతరహిత । మామహాపరతత్త్వ మచలమఖండ
మామహాపరతత్త్వ మవికారమమల । మామహాపరతత్త్వ మజమవ్యయాము
ఆమహాపరతత్త్వ మణువధికంబు । ఆమహాపరతత్త్వ మప్రమేయంబు
ఆమహాపరతత్త్వ మభినుతిశేయ । నలనొప్పవేదాంత వాక్కులకైన
అలవిగాదట్టి సత్యస్వరూపమున । పాయనినూత్నస్వభావమొక్కెడను
మాయాగుణంబుల మలశికల్పింప । నవితమఃసత్త్వ రజాభిధానముల
తవిలినతత్సంగతంబైనచిత్తు । ఈశ్వరాహంకార మెనయంగపడ్డ
నైశ్వర్యసంపన్ను డగుయీశుడయ్యె । కనుపట్టునతని సంకల్పంబువలన
ననుపడునైదింట పంచభూతములు । పంచీకృతములైన పంచభూతాళి
నంచితస్థూల దేహములుద్భవించె । పంచీకృతముగాని పంచభూతాళి
నంచితలింగ దేహములుద్భవించె । అవియెబ్రహ్మాండ పిండాండంబులగుచు

౮ శక్తిద్వయనిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక సదృష్టాంతప్రకాశిక.

అవిరళస్థితిసృష్టి కమరనిర్మించి । ఆశరీరముల నొయ్యనప్రవేశించి
యీశుడుసంకల్ప హేతుడునగుచు । యిట్లుప్రవేశించి యెల్లదేహముల
గుల్లేరుపడజీవ కోట్లుతానగుచు । మలయంగమంత్రసామర్థ్యంబుచాత
పులియైనమనుజుండు పురియైనకరణి । అక్కరతాన విద్యావిలాసమున
చిక్కితన్నెరుగక జీవింపదొణగె । స్థావరజంగ మాత్మకమైనజగము
జీవవిస్తారంబు చేవిస్తరిల్లె । అదిమొదలుబ్రహ్మకల్పాంతంబుదనుక
తుదలేనిజన్మమృత్యువులబొందుచును । నాటికైనవిమోచనము లేకజీవ
కోటులుప్రకృతి లోకుదిశిమూర్ఛిల్లు । కల్పాదులందెల్ల క్రమ్మరబుట్టి
కల్పాంతమునతొంటి గతివొందుచుండు । సకలదేహంబుల సద్విచారములు
తనకుతగినట్టు మానవశరీరములు । గైకొన్నమనుజులు కర్మబంధముల
తేకువచెడియున్న తెరగొప్పదెలిశి । మనుజులలో నుత్తమప్రజ్ఞుడైన
మనుజుడొక్కడుజన్మమరణదోషములు । కనివిరాగమునమోక్షముబొందవలశి
జనలోకనుతకీర్తి సద్గురుమూర్తి । శేవించిశిశ్రూష శేయుచునతని
భావంబుగరగించి పలికెనోస్వామి । చాలుజన్మంబులు చాలుభోగములు
చాలుసంసారంబు చాలుసర్వంబు । శరణుజొచ్చితి కటాక్షంబునముక్తి
వెరవుపదేశింప వేయనిమ్రొక్కి । లేవకయున్న లేలెమ్మనీకోర్కె
వేవేగనేదీర్తు వెరువకుమనుచు । అభయదానముచేశి యాగురుస్వామి
శుభముహూర్తమునశిష్యునిచారబిలచి । ముజ్జగంబులనీవె ముఖ్యుండవనుచు
బుజ్జగింపుచున్నిట్లు బోధింపదొణగె । వొకుమూరకవొక యుక్తిజెప్పెదను
ప్రాకటబుద్ధినా పలుకాదరించు । స్నానసంధ్యలచాత జపములచాత
దానక్రియలచాత తపములచాత । వనవాసములచాత వ్రతములచాత
మునివర్తనలచాత మోక్షంబులేదు । నినునీవుచింతించి నీస్వరూపంబు
కనుగానదేర్చిన కలదుమోక్షంబు । పాపపవిద్యచే భ్రమశినీచిత్స్వ
రూపంబునీకు వేరుగజూచినావు । జీవుడననుట విభ్రాంతిబోవిడువు
నీవెపిండాండముల్ నిండియున్నావు । నీవె బ్రహ్మాండముల్ నిండియున్నావు

నీవెయవ్వలనెల్ల నిండియున్నావు | నీయందె జన్మించు నిఖిలభూతములు
నీయందె వర్ధిల్లు నిఖిలభూతములు | నీయందె లయమొందు నిఖిలభూతములు
వేయునేటికినీవు వేరు లేదొకటి | యింతయెఱింగిన యదియె మోక్షంబు
యింతయెఱింగిన యదియె మోక్షంబు | చింతించుమనిన యాశిష్యరత్నంబు
ధీశాలిగావున దృఢనిష్ఠ చేత | దేశికదత్తోప దేశక్రమమున
పంచకోశంబులే ర్పడతానుగాక | మించినిలిచినభావ మేతానటనుచు
నిశ్చయమొనరింప నిబిడమైయుండి | నిశ్చేష్టుడైయుండ నిమిషమాత్రమున
అపుడు శ్రీసద్గురుడానందమొంది | విపులసమాధిలో వెలయునాశిష్యు
ముట్టిలెమ్మని బహిర్ముఖచిత్తు జేయ | యట్టకేలకునతం డంతయు దెలసి
వందనమొనరింప వరదుడాగురుడు | పొందికెలదుగనా పుణ్యుడిట్లనియె
మీయనుగ్రహమున మేనులుమూడు | పాయంగజూడ లోపలిచూపునిలిచె
మిఱియునాచూపు భ్రూమధ్యంబునందు | నెరయనంతంతకు నిశ్చలంబయ్యె
అపుడలౌకికమైన అద్భుతజ్యోతి | తపనకోటులభాతి తఱిమిడిదోచె
ఆవెంటదీర్ఘఘంటారావరీతి | గావినవచ్చె నోంకారఘోషంబు
ఆవెంటనానంద మొందియామీద | యేచూపుడోచునో యింపుగాననుచు
భావింపగా స్వానుభవరసామృతము | గానిమరేమియు గానరాదయ్యె
కానవచ్చినవెల్ల కడదోచిచూడ | పలుకశక్యముగాని భావముననుంటి
అలరంగననుచు మాటాడకనిలిచి | నిలిచి నీతోచినన్నియు వేరువేర
తెలిశేయుదయేమి తెరగులౌనొకో | ఆనతియిమ్మన్న నాగురుస్వామి
మాన్యతమోక్షసామ్రాజ్యమంటుటకు | గురుతులునీవు పేర్కొన్నలక్షణము
లరిదియెంతటివారికైన వీక్షింప | ధన్యుడవైతివింతటినుండినీవు
మాన్యులసంగతే మరకవర్తిలుము | కామరోషముల పోకడవిచారించి
యామరకుండుము యారీతినున్న | త్రిపుటిశూన్యంబైన దృఢనిశ్చయంబు
యెపుడుబాయకయుండు హృదయంబునందు | లలితజీవన్ముక్తి లక్షణంబదియె
వలనొప్పుయిట్టి జీవన్ముక్తుడిలను | ప్రారబ్ధనాశన పర్యంతమంగ

౬ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

ధారియైయుండుట దర్పణంబు ॥ వలెగాని లోకుల వలెగాదనుమ్మ
నాదుపలుకులు నెర నమ్మమిందులకు ॥ వేదాంతములుసాక్షి విబుధులుసాక్షి
ధారుణిదాన పాత్రంబైనయట్టి ॥ యీరాజవిద్యనే నిచ్చితినిటను
ప్రకటంబుశాయక భక్తులైనట్టి ॥ అకలంకహృదయుల కర్థిబోధింపు [నిదె
మనుచుబుద్ధులు చెప్పియనుపవాఘనుడు ॥ గురుదేవునకుమ్రొక్కి కొమరొప్పఁజ
నిరుపమానందుడై నిజపురంబునకు ॥ యీయితిహాసంబు యెవరుబాడినను
యీయితిహాసంబు యెవ్వరువినిన ॥ భోగమోక్షంబుల బొందియుండుదురు
పురుషులకైనను పొలతులకైన ॥ పురుషార్థమిహమందె పొందగావచ్చు
యీచరిత్రంబు మహిస్థలిమీద ॥ ఆచంద్రతారార్కమైయొప్పగాత॥

* కందార్థము. *

౫౩ * మేలుకసుషుప్తిలోపల * నేలీలంతనకుదాను * యేతెంచునోగు * త్రాలీలబయలులోపల * వాలాయము తనకుదానే * వచ్చూచునోయన్నా * వచ్చిపోచ్చి చచ్చూచునోయన్నా * యీలోపలనె బట్టబైలున్నాదెరిగితె * యేలోకమునవిల్వజాలా దెరుగకుంటె * వచ్చూచునోయన్నా * వచ్చిపోచ్చి చచ్చూచునోయన్నా ॥ * * *

* కందార్థము. *

౫౪ * ఆటాడియాడకుండును * ఆటాడినమేనిబొమ్మ * ఆటాడకనే * ఆటాడునెరుకయనియెడి * యాటాడించేటివాడు * అతడేరాకర్తా * అంతటికియీయచలమకర్తా * చేటూపాటులరెంటి చేవచ్చూఫలముము * మ్మాటీకనుభవించి * మరణాజననములొంద * నతడేరాకర్తా * అంతటికీయీ యచలమకర్తా ॥

( * ) మహావాక్యబోధ. ( * )

హరిఃఓమ్ "ప్రజ్ఞానం బ్రహ్మ."

శ్లో॥ యెనేతుశ్శ్రోత్రేణోతీదం । జిఘ్రతివ్యాకరోతిచ ।

స్వాద్వస్వాదువిజానాతి । తత్ప్రజ్ఞానముదీరితం ॥

టీ॥ యేనచక్షుర్ద్వారా నిర్గతాంతఃకరణ వృత్త్యుపాధిక చైతన్యేనరూపాదికమీక్షతే । యేనశ్రోత్రేంద్రియద్వారా నిర్గతాంతఃకరణ వృత్త్యుపాధికేన చైతన్యేన శబ్దంశృణోతి యేనఘ్రాణేంద్రియద్వారా నిర్గతాంతఃకరణ వృత్త్యుపాధికేన చైతన్యేన గంధంజిఘ్రతి । యేనవాగింద్రియావచ్ఛిన్నేన వచనంకరోతి । యేనరసనేంద్రియద్వారాస్వాద్వస్వాదువిజానాతి । సకలేంద్రియై రంతఃకరణ వృత్తిభేదేన యచ్చైతన్యమస్తి తదేవాత్ర ప్రజ్ఞానమిత్యుచ్యతే ఇత్యర్థః॥

శ్లో॥ చతుర్ముఖేంద్రదేవేషు । మనుష్యాశ్వగవాదిషు ।
చైతన్యమేకంబ్రహ్మాతః । ప్రజ్ఞానంబ్రహ్మమయ్యపి ॥

టీ॥ ఉత్తమేషు దేవాదిషు । మధ్యమేషు మనుష్యేషు । అధమేష్వశ్వాదిషు । దేహధారిషు । ఆకాశాది భూతేషు । జగజ్జన్మాది హేతుభూతం యదేకం చైతన్యమస్తి । తద్బ్రహ్మేత్యర్థః॥ యతః తద్వావస్థితం ప్రజ్ఞానంబ్రహ్మ । అతోమయ్యప్యవస్థితం ప్రజ్ఞానం బ్రహ్మైవ ప్రజ్ఞానత్వమశేష ఇత్యర్థః॥ ఋగ్వేదోక్తవాక్యార్థం ॥

శ్లో॥ దేహేంద్రియాదివృత్తిస్స్యా । త్తత్సాక్షిత్వేనచేతనం।
ధ్యాయేద్దృశ్యానువిద్ధోయం । సమాధిస్సవికల్పకం॥

శ్లో॥ అసంగస్సచ్చిదానంద । స్స్వప్రభాస్వతవర్జితః ।
ధ్యాయేచ్ఛబ్దానువిద్ధోయం । సమాధిస్సవికల్పకః ॥

శ్లో॥ స్వానుభూతిరసావేశాత్ । దృశ్యశబ్దానుపేక్షితు ।
నిర్వికల్పసమాధిస్స్యాత్ । నివాతస్థితదీపవత్ ॥

"అహం బ్రహ్మాస్మి."

శ్లో॥ పరిపూర్ణపరాత్మాత్ర । దేహేవిద్యాధికారిణీ ।

బుద్ధేస్సాక్షితయాస్థిత్వా । స్ఫురన్నహమితీర్యతే ॥

టీ॥ స్వతః స్వప్రభావతో దేశ కాల వస్తుభిరపరిచ్ఛిన్నః । పరిపూర్ణః పరమాత్మా అత్రాస్మిన్ । మాయాకల్పితేజగతి । విద్యాధికారిణి శమాది సాధన సంపన్నత్వేన విద్యాసంపాన యోగ్యస్మిన్ దేహేమనుష్యాది శరీరబుద్ధే ర్భుద్ధ్యుపలక్షితస్య సూక్ష్మశరీరస్య సాక్షితయా అవికారిత్వేనఅవభాసక తయాస్థిత్వా అవస్థాయా స్ఫురన్ ప్రకాశమానోహ మిత్యత్ర లక్షణతయా అహం పదే నోత్యత ఇత్యర్థః ॥

శ్లో॥ స్వతఃపూర్ణపరాత్మాస్మిన్ । బ్రహ్మశబ్దేనవర్ణితః ।
అస్మీత్యైక్యపరామర్శ । తేనబ్రహ్మభవామ్యహం ॥

టీ॥ స్వతఃస్వభావతో దేశ కాలాద్యనవచ్ఛిన్న పూర్ణోక్తః । పరమాత్మాస్మిన్ మహావాక్యే బ్రహ్మశబ్దేన బ్రహ్మేత్యనేన పదేనవర్ణితః ।లక్షణయోక్త ఇత్యర్థః ॥ ఏతద్వాక్య గతేన అస్మీతిపదేన పదద్వయ సమానాధికరణం జీవబ్రహ్మణోరైక్యం పరామృశ్యత ఇత్యాహ॥

" త త్త్వ మ సీ . "

శ్లో॥ ఏకమేవాద్వితీయ్యంసం । నామరూపవివర్జితం ।
సృష్టేఃపురాధునాప్యస్య । తాదృక్త్వంతదుదీర్యతే ॥

శ్లో॥ శ్రోతుర్దేహేంద్రియాతీతం । వస్త్వత్రత్వంపదేరితం ।
ఏకతాగ్రాహ్యతేసీతి । తదైక్యమనుభూయతాం ॥

టీ॥ శ్రోతుః శ్రవణాద్యనుష్ఠానేన వాక్యార్థ ప్రతిపత్తుః । దేహేంద్రియ విలక్షిత స్థూలాది శరీరత్రయ సాక్షితయా తద్విలక్షణ వస్తు సద్వస్త్వైవత్వమితి పదేనఈర్యతే । లక్షితఇత్యర్థః॥ ఏకతాగ్రాహ్యతే అసీతిపదేన ఐక్యత ఇత్యర్థః॥

" అ య మా త్మా బ్రి ం హ్మ . "

శ్లో॥ స్వప్రకాశాపరోక్షత్వం । అయమిత్యుక్తితోమతః ।

శక్తిద్వయ విరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందాధారానేక సదృష్టాంత ప్రకాశిక.

అహంకారాది దేహాంతాత్ । ప్రత్యగాత్మేతిగీయ్యతే ॥

టీ॥ అదృష్టాదినపిత్య సాపరోక్ష్యత్వం ఘటాదివదృశ్యత్వంచ వ్యావర్తయితుం విశేషణద్వయమితి బోద్ధవ్యం దేహాదిష్వపి ఆత్మశబ్ద ప్రయోగదర్శన దత్ర ఆత్మశబ్దేన కింవివక్షిత మాకాంక్షాయామాహ । అహంకారాది దేహాంతాత్ యస్య అహంకార ప్రాణ మన ఇంద్రియ దేహ సంఘాతస్యసో అహంకారాదిః తథా దేహః అంతో యస్యోక్తసంఘాతస్య స దేహాంతః అహంకారాదశ్చాసౌ దేహాంతశ్చేతి తథా తస్మాత్ ప్రత్యక్ అధిష్ఠానతయా సాక్షితయా అంతరాత్మేతి గీయ్యతే అస్మిన్వాక్యే ॥ ఇత్యర్థః ॥ బహువ్రీహిసమాసః ॥

శ్లో॥ దృశ్యమానస్యసర్వస్య । జగతస్తత్త్వమీర్యతే ।
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ । స్వప్రకాశాత్మరూపకం ॥

టీ॥ దృశ్యత్వేన మిథ్యాభూతస్య సర్వస్య ఆకాశాదిజగతః తత్త్వమధిష్ఠానతయా తద్బాధావధిత్వేనచ పారమార్థికం సచ్చిదానందలక్షణం యద్రూపమస్తి తద్బ్రహ్మశబ్దేన ఈర్యతే కథ్యత ఇత్యర్థః ॥ యస్య తత్స్వప్రకాశాత్మకం సఏవేత్యర్థః ॥

( యోగవాసిష్ఠము. )

* శుకజనకసంవాదము. *

కం॥ అనఘచిద్రూపుఁడొకఁడు * వినుము మున్యము లేదుసుమ్ము * వివరింపంగా
తనసంకల్పమెబంధము * తనసంకల్పక్షయంబె * తగముక్తియగున్ ॥

* వ్యాసశుకసంవాదము. *

కం॥ ఈమలినపుసంసారం * బేమిటనుదయించె నెంత * యెవ్వనికిటయిం
కేమిగతియెంచ్చ డడుగును * ధీమన్నుత తెలియనాన * తీయవెనాకున్ ॥

వ॥ అనిన వేదవ్యాసుండు పుత్రునకిట్లనియె.

కం॥ తనబుద్ధివికల్పమునను * జనియించుజగంబుదాని * సంక్షయమున నా
శనమొందునుసంసారం * బనిమదిగనుమిదియె * నిశ్చితార్థముపుత్రా ॥

## * శుక జనక సంవాదము *

కం॥ యిదితత్వనిశ్చితార్థము * విదితంబిదితప్పలేదు * వేరొక్కటిని
మదిదృశ్యముడిగినాడవు * పదిలెంబుగనిదియెపట్టి * భ్రాంతిదొరగుమీ ॥

కం॥ అనితత్వనిశ్చయముదన * జనకుండునుజెప్పినట్లు * జనకుడు జెప్పన్
వినిమానసవిశ్రాంతియు * తనరగశుక యోగివరుడు * తిప్పతికనియెన్ ॥

కం॥ నా తెలివియునిట్టిదమును * మాతండ్రియుజెప్పె శాస్త్ర * మతముంన్ని దెమీ
చాతం దెలియగవింటిని * చేతోవిశ్రాంతిగంటి * చిత్సౌఖ్యనిధీ ॥

కం॥ అనిశుకుడునిశ్చితార్థము * గనిబహుకాలంబునిర్వి * కల్ప సమాధిన్
జననిల్పిముక్తిగతిబొం * దెనుదానినస్నేహాయుక్త * దీపముపోలెన్ ॥

## మహావాక్య బోధ పరికరణము

శ్లో॥ శ్రీపుష్పశైలవాసాయ ♦ పూర్ణాయపరమాత్మనే
సమ్యజ్ఞాన ప్రబోధాయ ♦ సద్గురుబ్రహ్మణేనమః ॥

శ్లో॥ మహావాక్యార్థవిజ్ఞాన ♦ వివర్ణగురుబోధతః
యథాబుద్ధిసమాలోక్య ♦ శిష్యాభిజ్ఞాన హేతవే ॥

శ్లో॥ యస్యప్రసాదాదహమేవతత్వం ♦ బ్రహ్మేతిజానామి నిరస్తమోహః
తమేవనిత్యంవిభుమాత్మతత్వం ♦ శ్రీవాసుదేవంశిరసానమామి ॥

॥ అర్థం ॥ యీలోకనుందు వకానొకఅధీకారి అనేక జన్మాలనుంచి ఈశ్వ
రార్పణంగా చేశిన నిత్యనైమిత్తిక కర్మాలచాతనున్ను, సగుణోపాస్తిచాత

మున్ను, శుద్ధాంతఃకరణుడై నట్టివంటివాడై యీమనుష్యలోకం మొదలుకొని బ్రహ్మలోకపర్యంతమున్ను, సర్వం కర్మనిర్మితము అనిత్యము దుఃఖస్వరూప మనియెరింగి యీజన్మమరణరూపమైన సంసారంవల్లనుంచిన్ని, భయపడ్డవాడై సత్యాసత్యవస్తువివేకమున్ను, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగమున్ను, శమాది షట్క సంపత్తిన్ని, ముముక్షుత్వమున్ను, యీనాలుగుసాధనలతో కూడుకున్నవాడై కానుకలు చేతపట్టుకొని వేదాంతశాస్త్రజ్ఞుండై అనుభవనిష్ఠుండై ఉపశాంతిసిద్ధియైన సద్గురువుల శరణుబొంది సాష్టాంగ ద్వాదశ నమస్కారములు చేసి అడుగుచున్నాడు. హేస్వామిన్ పరమగురో యీసంసారమందు ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక, తాపత్రయాలచేతను మిక్కిలి కొట్టబడ్డవాడనైతిని. గనుక యీసంసార భయంవల్లనుండిన్ని ఆపన్నప్రయాసంలేక సులభంగాయేరీతి సంతరింతునో ఆప్రకారంగాను సకల వేదాంతాలయొక్క తాత్పర్యార్థము సంక్షేపంగా నాయందు కృపాకటాక్షంచేత అనుగ్రహం చేయండీ అని యిట్లువలె శిష్యుడు అడుగంగాను గురువులు ఉపదేశం చేయుచున్నారు. రావోయిశిష్యుడా మహావాక్యాలయొక్క అర్థ విచారంవల్ల పుట్టినట్టివంటి జీవపరమాత్మలయొక్క ఐక్యజ్ఞానమేదిగలదో అదే మోక్షసాధనమున్ని సకలవేదాంతాలయందు నిర్ణయింపబడ్డట్టివంటి అర్థము యిట్లువలె గురువులు ఉపదేశం చేస్తే శిష్యుడు తిరిగిఅడుగుచున్నాడు. హే మహాస్వామిన్ నేను యేమహావాక్యాలను యెరుగను వాక్యార్థ విచారమున్ను యెరుగను ఈశ్వరుణ్ణి యెరుగను, జీవుణ్ణి యెరుగను, జీవేశ్వరుల ఐక్య సంధానమున్ను, యెరుగను, నాకుబంధం యెందుచేత వచ్చెనో అదిన్ని మోక్షముపొందేపరిహారము యెరుగను, గనక పరమదయాపరమూర్తివి గనక నాయందుదయచేతను లెస్సగా విస్తరించి అనుగ్రహం చేయండి, అని శిష్యుడు ప్రశ్న చేయగా గురువులు అనుగ్రహం చేస్తూవున్నారు. మహాలెస్స మంచి ప్రశ్నలు చేస్తివి వీటియొక్క స్వరూపము స్పష్టంగా చెప్పేము సావధానంగావినుము. యీనాలుగు వేదాలయొక్క ఉపనిషత్తులయందు నాల్గు మహా వాక్యములు

గలవు అవియేవంటే చెప్పేను. "ప్రజ్ఞానంప్రతిష్ఠా" "ప్రజ్ఞానంబ్రహ్మ" యిది ఋగ్వేదమందు వాక్యం. "అహంబ్రహ్మాస్మి" యిదియజుర్వేదమందు వాక్యము "తత్వమసి" యిది సామవేదమందు వాక్యము. "అయమాత్మాబ్రహ్మ" యిది అధర్వణ వేదమందు వాక్యము. యీనాల్గు వేదాలయొక్క తాత్పర్యము చెప్పేము. వాక్యార్థజ్ఞానానకు కారణం పదార్థం గనుక పదార్థమే ముందు చాయదగినది అవి తత్వమన్నిన్ని, అసిపదమన్నిన్ని, పదార్థమనంగా యేదం టేను, తత్పదార్థమనంగా యీశ్వరుడు, "త్వం" పదార్థమనంగా జీవుడు. అసిపదార్థ మైక్యం తత్వ పదార్థ భూతుడైన ఈశ్వరునియొక్క స్వరూప మేదంటేను। మాయకు అధిష్ఠానమైన బ్రహ్మ చైతన్యము మాయయందు ప్రతిఫలించిన చిదాభాసునియొక్క సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వాదిగుణాలు తత్పదార్థుడైన ఈశ్వరునియొక్క ధర్మాలు! "త్వం" పదార్థ భూతుడైన జీవుని యొక్క స్వరూపమేదంటేను అధిష్ఠాన చైతన్యముచాతనే ముందు కల్పితమై నట్టువంటి లింగశరీరమున్న, లింగశరీరమందు ప్రతిఫలించిన చిదాభాసునియొ క్క ధర్మాలైన కించిజ్ఞత్వ, కర్తృత్వ, భోక్తృత్వాములున్నకూడి, త్వంపదార్థ స్వరూపము। అసి పదార్థానకు జీవుడే బ్రహ్మం, బ్రహ్మమే జీవుడు, అని లక్ష్యార్థము అని యీరీతిన గురువులు అనుగ్రహించేస్తే శిష్యుడు పునః అడు గుచూవున్నాడు. కించజ్ఞత్వ, గుణాలతో గూడుకున్నట్టువంటి జీవునికిన్ని, సర్వజ్ఞత్వాది గుణాలతో గూడుకున్నట్టువంటి యీశ్వరునికిన్ని, ఐక్యము యట్లా సిద్ధించెను. యీవిరోధమైన అర్థమందు శ్రుతులైనా యెట్లువలె బోధింపుచున్నవి, నాకు సంశయములైతే లేస్సగావున్నవి, లెస్సగా బోధింపు డాలని ప్రశ్నలుశాయగా గురువులు అనుగ్రహం చేయుచున్నారు. రావోయి శిష్యుడా! అడుగదగిన మంచిశంకలు అడుగదగినవాడవు అయితివి, సావధాన ముగావినుము. యీవాక్యానకు వాక్యార్థమనిన్ని, లక్ష్యార్థమనిన్ని, రెండు విధాలుగలవు. వాక్యార్థ మంగీకరిస్తేను యక్కడ ప్రత్యక్ష విరోధమై వుండునో అక్కడ లక్ష్యార్థ మంగీకరింప దగినది కాంగా- మహా వాక్యము

నందు లక్షణచేతను ఐక్యం బోధింపబడుచున్నదని లక్షణం అంగీకరింపదగినది
లక్షణ మూడు విధాలంటేను జహల్లక్షణం అజహల్లక్షణం జహదజహల్లక్షణ
మున్నిన్ని, మూడు విధాలుగలవు. దీనికి పేర్లు విడిచినలక్షణం విడువనిలక్షణం విడి
చీవిడువని లక్షణం అని మూడు పేర్లు యుండును. జహల్లక్షణమనగా యేదం
టేను చెప్పెదము. వకబ్రాహ్మణుడు గంగాతీరమునుంచి స్వదేశమునుగూర్చివస్తూ
వుంటె మరివకబ్రాహ్మణుడు అడిగెను? గంగా తీరమందు విశేషాలు యేమని
అడిగెను. ఆబ్రాహ్మణుడు "గంగాయాం ఘోషః" అని గంగయందు గొల్ల
పల్లె వున్నదని చెప్పెను. యీమాటకు తాత్పర్యం యేమంటేను గంగ అనేప
దార్థానకు ప్రవాహార్థము గనుక యీప్రవాహమందు గొల్లపల్లె వున్నదని
అంగీకరిస్తే ప్రత్యక్ష విరోధం గనక గంగ అనేపదానకు అర్థమైన ప్రవాహ
మును సర్వాత్మనా విడిచిపెట్టి ఆప్రవాహముతో కూడుకున్న గట్టుయందు
గొల్లపల్లెవున్నదని తాత్పర్యము. యిదిజహల్లక్షణము యిటువలెనే మహావా
క్యమందు జహల్లక్షణం చెప్పదామంటేను యిదకూడదు. యిదియెటువలెనం
టేను త్వంపదార్థమైన కూటస్థచైతన్య పర్యంతమున్ను, విడిచిపెట్టితే ముముక్షు
వైయుండేవారియొక్క స్వరూపమే లేకపోతున్నది. గనక ప్రత్యక్ష విరోధము
గానున్ను, యీజహల్లక్షణం కూడదు. యేలక్షణముచేత యీవాక్యము
బ్రహ్మమును బోధింపుచున్నాదంటేను, అన్నమయకోశమును మొదలుకొని,
విజ్ఞానమయకోశపర్యంతమున్ను, యీనాల్గుకోశాలుబ్రహ్మమని వేదవాక్య
లయందు చెప్పఃమాన్పంమను. జడమైనకోశాలు బ్రహ్మముగావు గనక యీ
కోశాలు విడిచిపెట్టి యీకోశాలకు అధిష్ఠాన భూతమైన చైతన్యమందే తాత్ప
ర్యము. యిదియిపుడు జహల్లక్షణం అజహల్లక్షణమనగా యేదంటేను,
"మంచాః క్రోశంతి" అనేవాక్యమందు మంచలు కూతలు బెట్టుచున్నవి. యీఅ
ర్థము గ్రహిస్తే జడాలైన మంచలు కూతలు బెట్టుచున్నవని చెప్పితే ప్రత్యక్ష
విరుద్ధము. గనక మంచలను విడచి ఆమంచలమీది పురుషుడు కూతలుపెట్టు
చున్నాడని, అజహల్లక్షణంచేత తాత్పర్యం నిశ్చయింపదగినది. యిటు

వలెనే వేదాంతమందు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" మనియెడి వాక్యమందు ఆనం
దమయకోశముతో కూడుకున్నట్టువంటి ఆత్మను చెప్పుచుండెగనుక సచ్చిదానం
దాలను విడువకనే యేఆనందమయ కోశమును చెప్పుచున్నాది. యీఅర్థం
మహావాక్యమందు అంగీకరింతామంటే కూడదు. అదియెట్టువలెనంటేను కించ
జ్ఞత్వ గుణములతో కూడుకున్నట్టువంటి చైతన్యమైన జీవుడు గనుక గుణవిశిష్టు
డైనవానికి ఐక్యం చెప్పకూడదు. గనుక యిక్కడ అజహల్లక్షణం చెప్ప
కూడదు. జహదజహల్లక్షణమనంగా యేదంటేను చెప్పేను, "సోయం దేవ
దత్తః" అనేటి వాక్యమందు గంగాతీరమందు అయిదోయేట యేదేవదత్తుణ్ని
చూస్తిమో ఆదేవదత్తుణ్ని కావేరీతీరమందు యాభై అయిదోయేట చూస్తి
మనేటి వ్యవహారమందు ఆదేశ యీపురుషుడన్ని కాలములతో కూడుకున్నట్టు
వంటి పురుషుడే వాక్యార్థమని అంగీకరిస్తిమాయనా, బహువిరోధముగున్నది
అదియెట్టువలెనంటేను చెప్పేము. గంగాతీరము కావేరీతీరముగాదు కావేరీతీరము
గంగాతీరముగాదు ఆకాలము యీకాలముగాదు యీకాలము ఆకాలము
గాదు ఆవయస్సు యీవయస్సుగాదు యీవయస్సు ఆవయస్సుగాదు గనుక
పరిమాణాంతరమైన ప్రత్యేకానకు విరుద్ధమై యున్నదిగనుక వాక్యార్థమైతే
తద్దేశ తత్కాలమున్ను విడిచి, ఏతద్దేశ ఏతత్కాలమున్ను విడిచి, లక్ష్యభూతు
డైన దేవదత్తుడే వాచ్యార్థము యెట్టువలెనో అట్టువలెనే. మహావాక్యమందు
తత్పదానకు వాచ్యార్థమైనమాయ మాయాప్రతిబింబ స్వరూపముగా సర్వజ్ఞ
త్వాదిగుణములకున్ను, త్వంపదానకున్ను, వాచ్యార్థమైన అవిద్యాఅవిద్యయందు
ప్రతిబింబించిన చిదాభాసుడే గుణాలైన, కించిజ్ఞత్వాదులున్ను, అంగీ
కరిస్తే ప్రత్యక్ష విరోధం గనక మాయా సర్వజ్ఞత్వాది గుణాలున్ను, అవిద్యా
కించజ్ఞత్వాది గుణాలున్ను, యీరెంటినీ తోశివేశి లక్షణ భూతమైన చైతన్య
మనే నేత్రిమనెడి ఆసచ్చిదానంద బ్రహ్మమేనీవు. నీవేసచ్చిదానంద బ్రహ్మ
మని జహదజహల్లక్షణాంచాతను యీనాలుగు వాక్యాలు బోధింపుచున్నవి
గనక నీవే బ్రంహ్మము. యీఅర్థమందు సంశయంలేదు. సిద్ధం యీమహా

వాక్యాలయొక్క అర్థము సంక్షేపముగా చెప్పేము వినుము. "ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానంబ్రహ్మ" అనెటి వాక్యమందు అర్థం ప్రతిపాదించెటి,

శ్లో॥ యెనేక్షతేశృణోతీదం । జిఘ్రతివ్యాకరోతిచ ।
స్వాద్వస్వాదువిజానాతి । తత్ప్రజ్ఞానముదీరితం ॥

కనులగుండా బయిలుదేరిన అంతఃకరణవృత్తులతో గూడుకొన్న యజ్ఞానం చాత ఘటపటాదులు చూస్తూవున్నాడో శ్రోత్రేంద్రియంగా బయలుదేరిన అంతఃకరణవృత్తులతో గూడుకున్న యజ్ఞానంచాత శబ్దంయెరుగుచూవున్నాడో వాక్కులగుండా బయిలుదేరిన అంతఃకరణ వృత్తులతో గూడుకున్న యజ్ఞానం చాతమాట్లాడుచూవున్నాడో జిహ్వాయందున బయలుదేరిన అంతఃకరణవృత్తులతో గూడుకున్న యజ్ఞానంచాత షడ్రసాలనూ గుర్తెరుగుచున్నాడో యిష్టు వలెనే, సకలేంద్రియాలగుండా బయలుదేరిన అంతఃకరణలతో గూడుకున్న ఘువంటి యజ్ఞానంచాతను సకల బాహ్యేంద్రియాల విషయాలు యెరుగుచున్నాడో, సకలేంద్రియాలు, యేఅంతఃకరణంతో యెరుగుచున్నాడో, యిష్టువలెనే దేహములోపలను అంతఃకరణమున్ను, వాటియొక్క వృత్తులైన సంకల్పాలున్ను, ప్రాణాదులున్ను, ప్రాణధర్మాలైన క్షుత్పిపాసాదులున్ను, సాక్షిరూపమైన యజ్ఞానంచాత యేలక్ష్యార్థం యెరుగుచున్నాడో, ఆజ్ఞానం మాత్రమే "ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానంబ్రహ్మ" అనేపదానకు లక్ష్యార్థము అంతఃకరణమున్ను, దానివృత్తులు దేహేంద్రియాదులున్ను, వాచ్యార్థము తోశివేశి ప్రజ్ఞానంమాత్రమే త్వం, పదానకు లక్ష్యార్థము. బ్రహ్మమనెటిపదానకుఅర్థం.

శ్లో॥ చతుర్ముఖేంద్రదేవేషు । మనుష్యాశ్వగవాదిషు ।
చైతన్యమేకంబ్రహ్మాతః । ప్రజ్ఞానంబ్రహ్మమయ్యపి ॥

చతుర్ముఖుడు మొదలైన దేవతలయందున్ను, మనుష్యాశ్వ గవాది పిపీలికాది జీవాదులయందున్ను, అనుశ్యూతమై యేకమైన చైతన్యమే బ్రహ్మ, అనెప

దానకు లక్ష్యార్థం బ్రహ్మశరీరం మొదలుకొని, మశకశరీర పర్యంతమున్న, సకల శరీరాలు వాచ్యార్థము గనుక మాయాకార్యమని త్రోసివెయ్యదగినది యీ వాక్యార్థము చెప్పేము. రావోయి శిష్యుడా? యీప్రకారంగానే నిశ్చయించుకొనినట్టువంటి ఆవాచ్యార్థ పట్టిన్నుండి సర్వత్రా అనుస్యూతమైన చైతన్యమే బ్రహ్మ స్వరూపము చైతన్యమన్నా, బ్రహ్మమని యన్నా, ఆత్మఅనిఅన్నా, పేర్లుమాత్రమే వేరు గాని వస్తువు వకటి గనుక బ్రహ్మమని నిశ్చయించుకో వలెను. "అహంబ్రహ్మాస్మి" యనేటి పదానకు అర్థం అహమనిన్ని బ్రహ్మ మనిన్ని, అస్మిఅనిన్ని మూడువిధాలు అహమనేటి పదానకు అర్థం.

శ్లో॥ పరిపూర్ణః పరాత్మాస్మిన్ । దేహేవిద్యాధికారిణి ।
బుద్ధేస్సాక్షితయాస్థిత్వా । స్ఫురన్నహమితీర్యతే ॥

పరిపూర్ణమైన పరమాత్మ బ్రహ్మవిద్యకు యోగ్యమైన యీశరీరమందు బుద్ధికి సాక్షిగా వుండుకొని స్ఫురింపుచున్న అహమనేటి విధంచాత చెప్పంబడును. యిది యెట్లవలెనంటేను అహమనేటప్పుడు చైతన్యం నిర్వికారముగనుక అహ మనరాదు. అహం పదమంటేను అహంకారము జడం గనుక అహమని చెప్ప నేరదు. అహంపదమంటేను, పరమాత్మభూతమైన చైతన్యమే అహంకారము తోగూడుకొని అహమని స్ఫురింపుచున్నది అహము గనుక జడమైన వాచ్యార్థమైన అహంకారమును త్రోసివేసి చైతన్యమాత్రమే అహమనేటిపదానకు లక్ష్యార్థము. యీ బ్రహ్మమనేపదానకు అర్థము చెప్పేము.

శ్లో॥ స్వతఃపూర్ణః పరాత్మాత్ర । బ్రహ్మశబ్దేనవర్ణితః ।
అస్మీత్యైక్యపరామర్శః । తేనబ్రహ్మభవామ్యహం ॥

॥అర్థం॥ స్వతఃపూర్ణమైనట్టువంటి పరమాత్మ యీమహావాక్యమందు బ్రహ్మమనేటి పదానకు లక్ష్యార్థము యీ వాక్యార్థము చెప్పేము. యేదో కట్టకారణాన బట్టుండి సర్వత్రా పరిపూర్ణమైనట్టి ఆత్మే బ్రహ్మమే అది

కారణాన బట్టుండి బుద్ధికిసాక్షియై యుండేమ్వంటి నేనే బ్రహ్మమైతిని. అస్మి పదంచాతను ఐక్యం ప్రతిపాదింపబడుచున్నది. గనుక రామ్రాయి శిష్యుడా? నీప్పుడువలెనే నిశ్చయించుకోవోయి. సామవేమందలి వాక్యము "తత్వమసి" తత్పదమన్నిన్నీ, త్వం పదమన్నిన్నీ, అసిపదమనిన్నీ, మూడు పదాలు తత్పదార్థము చెప్పేను..

శ్లో॥ ఏకమేవాద్వితీయంస । న్నామరూపవివర్జితం ।
సృష్టేః పురాధునాప్యస్య । తాదృక్త్వంతదుదీర్యతే॥

అర్థం ॥ సృష్టికి పూర్వమందు ఏకమై, అద్వితీయమై, నామరూప రహితమై యేదిబ్రహ్మపుడైన ఆత్మవుండునో, ఆయాత్మకు యిప్పుడు తత్ అనెటిపదంచాతను నామరూపరహితమైన చైతన్యమాత్రమే చెప్పంబడుచున్నది. యిదితత్పదార్థం యిక త్వం పదార్థానకు,

శ్లో॥ శ్రోతుర్దేహేంద్రియాతీతం । వస్త్వంతరముదీరితం ।
ఏకాగ్రాహ్యమసీతేతి । తదైక్యమనుభూయతాం ॥

అర్థం ॥ వినెటియధికారియొక్క దేహేంద్రియాదులకు అతీతమైన సాక్షిభూతమైన చైతన్యమే త్వంపదము చెప్పంబడుచున్నది. అసి అనెటిపదంచాతను ఐక్యం తత్పద లక్ష్యార్థమైన చైతన్యమేనీవు, త్వం, పదలక్ష్యార్థమైన నీవే తత్పద లక్ష్యార్థమని ఐక్యం ప్రతిపాదింపుచున్నది. గనుక అధికారివైన నీవు ఐక్యార్థము అనుసంధానము శాయవోయి యిక అథర్వణవేదమందు వాక్యం "అయమాత్మాబ్రహ్మ" అయం ఆత్మా బ్రహ్మ అనెటిమూడుపదాలు వీటికి

శ్లో॥ స్వప్రకాశాపరోక్షత్వం । అయమిత్యుక్తితో మతం ।
అహంకారాదిదేహాంతం । ప్రత్యగాత్మేతిగీయతే ॥

అర్థం॥ అయమనెటి పదంచాతను స్వప్రకాశమైన పరోక్షమై యుండేది ఆత్మయని చెప్పంబడుచున్నది. గనుక అహంకారము మొదలుకొని స్థూల

దేహపర్యంతమున్ను నాఅహంకారం నాదేహమని యెరగుచుండే చైతన్యమే చూడబడేది సమస్తమైన జగత్తూ యీయొక్క తత్వ బ్రహ్మమనేడి శబ్దాచాతను చెప్పబడు చున్నషువంటి లక్ష్యార్థము జగదధిష్ఠానభూతమై స్వప్రకాశినైన ఆత్మ అయమాత్మాఅని, యిషుఅని, యీనాలుగు మహా వాక్యాలయందున్నూ, నీవేబ్రహ్మము ఆబ్రహ్మమే నీవు అని ప్రతిపాదింపబడుచున్నది. నీవే సచ్చిదానందస్వరూపుడవై అద్వితీయ్యమైన ఆత్మస్వరూపుండవు జీవుడవు కావు బ్రహ్మ క్షత్ర్య వైశ్య శూద్రవర్ణాలునీకు లేవు బ్రహ్మచర్యం మొదలుకొని నాలుగుఆశ్రమాలు ఆయొక్క ధర్మాలున్ను నీకు లేవు అసంగుడవు కాలత్రియమందున్ను, జీవుడవుకావు నీకుఆగామీసంచిత ప్రారబ్ధాలైన కర్మాలు లేవు అఖండసుఖ స్వరూపుడవు యిషు అని సద్గురువులవారు హస్త స్పర్శ చేశి శిరస్సుపై శ్రీహస్తంవుంచి పరిపూర్ణానుగ్రహం చేశిరి. అషుతర్వాతను ఆశిష్యుడు బాహ్యంవిడిచి అనేకతపువులకు కన్నులు తెరచిచూచి దిగ్గునలేచి యెదుటవున్న సద్గురుస్వాములకు అనేక నమస్కారములు చేశి విజ్ఞాపన చేస్తూవున్నాడు. హేసద్గురుస్వామిన్ నేనుకృతార్థుడనైతిని నాకు మోహనివృత్తిఆయనని విజ్ఞాపన చేసుకొన్నవాడాయను.

శ్లో॥ యత్కృపాదేశికప్రోక్తం । మాయాబ్రింహైక్యతాత్మని।
తంవందేవాసుదేవేంద్ర । దేశికేంద్రమహమ్ముదా ॥

---

(*) కందార్థము. (*)

౫౫* దేహమునుజూచుకన్నులు * దేహమునకు వేరు లేని * తీరున యెరుకే * కోహంకస్వంతవదాసోహంసోహంబటంచు * చూచుచుండుసుమీ * తనకుదానేత్రోచుచుండుసుమీ * దేహిదేహములానే తెరగూనప్రసరించి * దేహముగాని విదేహిగాతనమూతా * జూచుచుండుసుమీ * తనకుదానే ద్రోచుచుండుసుమీ ॥ * *

౫౬ * పిండబ్రహ్మాండంబులు * రెండును మూరెంటిలోని * రెండహములుయీ

ఖండములు నాల్గుగూడియు * ఖండంబగు నొరుకరూపు * గనరామాతండ్రీ * యిది దెల్పినఘనుఁడే తలిదండ్రీ * ఖండాఖండములుగాగనిపించె నొరుకానె * దండిద నెటి యుద్దండులకలనైన * గనరామాతండ్రీ * యిది దెల్పినఘనుఁడే తలిదండ్రీ॥ * *

## (భద్రాద్రిరామశతకము.)

## * ప్రపంచోత్పత్తిలక్షణము. *

సీ॥ ఆత్మయందునయేకమాకాశముదయించె ౹ ఆకాశమందనిలముపుట్టె
ననిలంబువల్లను నగ్నిహోత్రుఁడుపుట్టె ౹ నగ్నిహోత్రమువల్ల నప్పుపుట్టె
నప్పువల్లనుమహీ యవనిస్థలియుఁబుట్టె ౹ నవనియందోషధులమరఁబుట్టె
నోషధులందున నొనరనన్నముపుట్టె ౹ నన్నమందున నరులాదిసకల
గీ॥ జంతుజాలంబులాయెనీజగముగంబు ౹ లాయనీరీతి పరమాత్మమాయవలన
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు ౹ రామనరసింహదాససంరక్షితాంహ్వ

## * భావార్థము. *

౭ * ఆత్మయందు ఆకాశము, ఆకాశమందు వాయువు, వాయువందు అగ్ని అగ్నియందు జలము, జలమందు పృథివి, పృథివియందు ఓషధులు, ఓషధులందు అన్నము, అన్నమునుంచి నరులాది సకల జంతుజాలములాయెను. ఈతీరుగా పిండబ్రహ్మాండములు పరమాత్మ మాయవలన ఆయెను.

## * చతుర్దశలోకస్థలనిర్ణయము. *

సీ॥ అతలంబుపాదముల్ వితలంబుగుల్ఫలు ౹ జంఘలుసుతలంబుజానులందు
యుండుతలాతలం బూరులందునమహా ౹ తలముగుహ్యము రసాతలముయుండు
కటినపాతాళలోకము నాభిభూలోక ౹ ముండుభువర్లోక ముదరమందు
స్వర్గంబుహృదియువక్షముమహాలోకంబు ౹ ఘనజనలోకంబుగళముబాముల
గీ॥ మధ్యమందుతపోలోకమనురుమూర్ధ్ని ౹ సత్యలోకంబునీనివాసస్థలంబు

౨౦ శక్తిద్వయ విరాసకంబైన శుద్ధసగుణతత్త్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

రమ్యగుణధామభద్రాద్రిరామపరశు ॥ రామనరసింహ్వదాససంగతీతాంహ్వ

## * భావార్థము. *

౩౧ * అతలము పాదములు, వితలము గుల్భలు, సుతలము జంఘములు తలాతలము జానువులు, మహాతలము ఊరులు, రసాతలము గుహ్యము, పాతాళము కటి, భూలోకము నాభి, భువలోకము ఉదరము, సువలోకము హృదయము, మహాలోకము వక్షము, జనలోకము గళము, తపోలోకము భ్రూమధ్యము, సత్యలోకము మూర్ధ్ని.

## * జన్మహేతులక్షణము. *

సీ॥ ఆత్మయందునమాయయారోపితంబయ్యె ॥ మాయయందజ్ఞానమపుడుగల్గె
నజ్ఞానమునదోచెనవివేకమవివేక ॥ మందున నభిమానమమరబుట్టె
నభిమానమందురాగాదు లుద్భవమయ్యె ॥ రాగాదులందు కర్మములుబొడమె
కర్మమువల్లనుకడలేని సుఖదుఃఖ ॥ మూలమైన శరీరములు జనించె
గీ॥ యీవిధంబుగ దేహంబులెత్తిజనుల ॥ సిన్నగన లేరునిరుపమాఽర్మలాత్మ
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు ॥ రామనరసింహ్వదాససంరక్షితాంహ్వ

## * భావార్థము. *

౪౨ * ఆత్మయందు మాయారోపితము, మాయయందు అజ్ఞానము, అజ్ఞానమందు అవివేకము, అవివేకమందు అభిమానము, అభిమానమందు రాగాదులు, రాగాదులందు కర్మము, కర్మమువల్ల దేహముబుట్టును. ఇటువంటి దేహములెత్తినవారు ఆని నెరుగవలెను.

## ( గర్భోపనిషత్తు. )

హరిః ఓం॥ శ్లో॥ పంచాత్మకంపంచసువర్తమానం। షడాశ్రయంషడ్గుణయోగయుక్తం।
తంసప్తధాతుంత్రిమలంద్విత్రియోనిం । చతుర్విధాహారమయంశరీరం॥
భవతిపంచాత్మకమితి । కస్మాత్పృథివ్యాపస్తేజో వాయురాకాశమిత్యస్మిన్

పంచాత్మకే శరీరే కాపృథివీ కాఆపః కిం తేజః కోవాయుః కిమాకాశమిత్యస్మిన్
పంచాత్మకే శరీరే యత్కఠినం సాపృథివీ యద్ద్రవం తదాపో యదుష్ణం తత్తేజో
యత్సంచరతి తద్వాయుర్యత్సుషిరం తదాకాశమిత్యుచ్యతే। తత్రపృథివీనామ
ధారిణీ। ఆపఃపిండీకరణే తేజోరూప దర్శనే వాయుర్వ్యూహనే ఆకాశ మవకాశ
ప్రధానే పృథక్చక్షుః శ్రోత్రే చక్షుషిరూపే జిహ్వోపస్థశ్చానందోపానేచో
త్సర్గే బుధ్యాబుధ్యతి మనసా సంకల్పయతి వాచావదతి షడాశ్రయమితి
కస్మాన్మధురామ్ల లవణ తిక్త కటు కషాయ రసాన్విందతే। షడ్జ ఋషభ
గాంధార మధ్యమ పంచమదైవత నిషాదాశ్చేతీష్టానిష్ట శబ్దసంజ్ఞాః ప్రతిదినాః
సప్తధాభవంతి। శుక్లోరక్తః కృష్ణోధూమ్రః పీతకపిలః। పాండురః సప్తధాతు
ముక్తతస్మాద్యదాదేవదత్తస్యవిషయాజాయంతే। పరస్పర రసోగుణత్వాత్ షడ్వి
ధోరసా రసాచ్ఛోణితం శోణితాన్మాంసం మాంసాన్మేదసో మేదసాస్థిన్యస్థిభ్యో
మజ్జా మజ్జాయాఃశుక్లం శుక్లశోణిత సంయోగాదావర్తతే గర్భోహృదివ్యవ
స్థాన్నయతి హృదయేభ్యాంతరాగ్ని రగ్నిస్థానేపిత్తం పిత్తస్థానేవాయు ర్వాయు
స్థానేహృదయం। ప్రాజాపత్యరుతుకాల సంప్రయోగత ఏకరాత్రోషితం కలి
లంభవతి। సప్తరాత్రోషితం బుద్బుదంభవతి। అర్ధమాసాభ్యంతరే పిండా
భవతి। మాసాంతరే కఠినోభవతి। మాసద్వయే శిరఃకురుతే। మాసత్రయేన
పాదప్రవేశో భవత్యథమాసేంగుళ్యకరకటిప్రజఠర ప్రదేశోభవతి। పంచమే
మాసి పృష్ఠదండోభవతి। షష్టేమాసి నాసాక్షిణి శ్రోత్రాణి భవంతి।
సప్తమేమాసి జీవనసంయుక్తో భవత్యష్టమేమాసి సర్వసంపూర్ణో భవతి।
పితురేతోతిరిక్తాత్పురుషో భవతి। మాతురేతోతి రిక్తాత్స్త్రియో భవతి।
ఉభయోర్బీజతుల్యాన్నపుంసకో భవతి। వ్యాకులిత మనోరంధాః కుబ్జా
వామనోభవంతి అన్యోన్య వాయుపీడితానాం శుక్లద్వైధే స్త్రియోన్యాయుగ్మాః
ప్రజాయంతే పంచాత్మక సమర్థః పంచాత్మక చేతసాధిగంధనశ్చ। జ్ఞానాధ్యా
నాదిక్షరమోంకారం చింతయతి। తదేతదేకాక్షరంజ్ఞాత్వాష్టౌ ప్రకృతయః।
షోడశవికారాః శరీరే తస్యైవదేహినా మథనవమేమాసి సర్వలక్షణసంపూర్ణో
భవతి। పూర్వజాతిస్మరతి కృతాకృతంచ కర్మ భవతి। శుభాశుభంచకర్మ

భవిందతి ॥ శ్లో॥ నానాయోని సహస్రాణి । దృష్ట్వాచైవతతోమయా । ఆహారావివిధాభుక్తా । పీతాశ్చవివిధాస్తనాః ॥ జాతస్యైవమృతస్యైవ । జన్మచైవపునఃపునః । అహోదుఃఖోదధర్మగ్నో । నపశ్యామిప్రతిక్రియాః ॥ యది యోన్యాంప్రముంచామి । సాఙ్ఖ్యంయోగంసమాశ్రయే। అశుభక్షయకర్తారం। ఫలముక్తిప్రదాయినం । యదియోన్యాంప్రముంచామి ।తంప్రపద్యేమహేశ్వరం అశుభక్షయకర్తారం । ఫలముక్తిప్రదాయినం । యదియోన్యాంప్రముంచామి తంప్రపద్యేభగవతం నారాయణందేవం । అశుభక్షయకర్తారం ఫలముక్తిప్రదాయినం । యన్మయాపరిజనస్యార్థే । కృతంకర్మశుభాశుభం ॥ ఏకాకి తేనదహ్యామి గతాస్తేఫలభాగినః ॥ జంతుస్త్రీయోనిశతం యోనిద్వారిసంప్రాప్తే యంత్రేణాపీడ్యమానో మహతాదుఃఖేన జాతమాత్రస్తు వైష్ణవేన వాయునా సంస్పృశ్యతే తదానస్మరతి । జన్మమరణా కర్మశుభాశుభ । శరీరమితికస్మా జ్ఞానాగ్నిదర్శనాగ్నిః కోష్ఠాగ్నిరితి । తత్రకోష్ఠాగ్నినామా శిత పీత లేహ్యచోష్యం పాచయతీతి రూపాదీనాం దర్శనంకరోతి । తత్రత్రీణిస్థానాని భవంతి । హృదయే దక్షిణాగ్ని రుదరే గార్హపత్యం ముఖాహ హవనియ్యం యజమానాయ బుద్ధిః పత్నింవిధాయ దీక్షాసంతోషం బుద్ధీంద్రియాణి యజ్ఞపాత్రాణి శిరః కపాలం కేశాదర్భా ముఖమంతర్వేది షోడశపార్శ్వదంత్త దఖిలోన్యష్టోత్తరం మర్మశత మశీతి సంధశతా నవస్నాయు శతమష్ట శతసహస్ర రోమ కోట్యో హృదయ పల్యాన్యష్టౌ ద్వాదశపలాజిహ్వా పిత్తంపరిస్థం కఫస్యాఢకం శుక్లస్య కుడుపం మేదప్రస్థౌ ద్వౌతనియత మూత్రి పురీషయో రహారహఃపాన పరిమాణం పైప్పలాదం మోక్షశాస్త్రం సమాప్తం ॥

—(*) హరిఃఓం తత్సదితి గర్భోపనిషత్సమాప్తాః (*)—

## * సర్వార్థసారే జీవతత్త్వము. *

క౦॥ విలసిల్లుమూడుతత్త్వము * తెలుపుమి మునుజీవతత్త్వ * మీశ్వరతత్త్వం
బలసచ్చిదాత్మతత్త్వం * బలరగనికపీటినిన్నా * యముతెట్టివనా ॥

వ॥ చిత్తగింపు మంతఃకరణంబు । నంతఃకరణ ప్రతిబింబ చైతన్యంబును తద
ధిష్ఠాన చైతన్యంబు నీ మూడునుం గలసి జీవుండనయ్యె । నాజీవుండొక
వేళ్ల నంతఃకరణంబునుం గూడెనేని విశ్వరూపంబున స్థూలదేహంబునం బొంది
తమోగుణప్రధానుండై సకల విషయ ప్రవర్తకత్వంబు బూని యతిచంచ
లుండై యుండు । నంతఃకరణ ప్రతిబింబచైతన్యంబునుం గూడెనేని తేజోరూ
పంబున సూక్ష్మదేహంబునుం బొంది రజోగుణప్రధానుండై జ్ఞప్తిమాత్రవ్యాప
కత్వంబు బూని యరుక మరుపులుం గలిగియుండు । మరియు తదధిష్ఠాన చైత
న్యంబును గూడెనేని ప్రజ్ఞారూపంబున కారణ దేహంబుతో గూడి సత్వగుణ
ప్రధానుండై నిశ్చేష్టితుండై జడత్వంబునను౦డు । నిట్టిజీవతత్వ లక్షణం బెట్లం
టేని । పంచభూతంబులును । పంచవిషయంబులును । పంచకోశంబులును ।
పంచప్రాణంబులును । పంచజ్ఞానేంద్రియంబులును । పంచకర్మేంద్రియంబు
లును । పంచవర్ణంబులును । దేహత్రయ । అవస్థాత్రయ । జీవత్రయ ।
మలత్రయ । కరణత్రయ । కర్మత్రయ । తాపత్రయ । వాసనాత్రయ ।
ఈషణాత్రయంబులును । అంతఃకరణచతుష్టయంబును । హానివృద్ధి యశోలా
భంబులును । కామాదిషట్కంబును । షడూర్ములును । షడ్భావ వికారంబు
లును । ఉత్పత్తి స్థితి లయంబులును । స్త్రీ పుంనపుంసక నిర్ణయంబులును ।
ఆచారానాచారంబులును । ఆదిమధ్యావసానంబులును । నానాభేదంబులును ।
నానావాదంబులును । నానావినోదంబులును । నానావైచిత్ర్యంబులును ।
నానా వేదంబులును । నానాశాస్త్రంబులును । నానాపురాణంబులును ।
నానాఇతిహాసంబులును । నానామంత్రంబులును । నానాయంత్రంబులును ।
నానాతంత్రంబులును । నానాకులంబులును । నానామతంబులును । నానా
శ్రమంబులును । నానావ్యవహారంబులును । అష్టమదంబులును । అష్ట పాశం
బులును । అష్టైశ్వర్యంబులును । అష్టకష్టంబులును । సప్త వ్యసనంబులును ।
పుణ్యపాపంబులును । సుఖదుఃఖంబులును । స్థావరజంగమంబులును । సంశ
యనిశ్చయంబులును । జ్ఞానాజ్ఞానంబులును । కారణకార్యంబులును । ధర్మా
ధర్మంబులును । గర్వాభిమానంబులును । లజ్జా భయంబులును । సహ్య

సహ్యాంబులును । సత్యాసత్యంబులును । అల్పాధికంబులును । రాగద్వేషం
బులును । దయానిర్దయలును । దేశకాలవస్తుపరిచ్ఛేదంబులును । నామరూ
పనిరూపణంబులును । నియమానియమంబులును । శుభాశుభంబులును ।
స్వతంత్రాపారతంత్ర్యంబులును । కర్తృత్వ భోక్తృత్వాది సహితంబై విలసిల్లు
నని చెప్పి మరియు నిట్లనియె ॥

గీ॥ తనువునేనటనుచుతనరూపమెరుగక ƒ నజ్ఞుడగుచునింద్రియములగూడి
వలసినట్లులెల్లవర్తించుకొనుచుండు ƒ వాడెజీవుడనగజూడనయ్యె ॥

మ॥ అడరన్ దేహనియుక్తుడై ƒ కడువికారాహంకృతుండైనజీ
వుడునంతఃకరణాదివృత్తులను ƒ దాబొల్పొందగాగాంచిదాప్రా
జ్ఞుడనేగాంచితినేనువింటి ƒ నిజముంచున్ మోహసంయుక్తుడై
కడువిభ్రాంతివహించివర్తిలు ƒ మహాగర్వంబువాటిల్లగన్ ॥

కం॥ వినురజ్జువుసర్పంబను * కొనుగతినయ్యుండుజీవ * గుణభావనచే
పనిబడిభయకంపాదిక * మునుజెందుచునుండుపరమ * మూఢుండగుచున్॥

ఉ॥ సారవిహీనమైదురిత ƒ సంకులమైబహుజన్మమూలమై
పారముగానిసాగరముభంగి ƒ భయప్రదమైనయట్టిసం
సారముమిథ్యగాదెలియ ƒ జాలకదారసుతాదులెల్లనా
వారసినమ్మిమోహమున ƒ వర్తిలుచుండెడివాడెజీవుడున్ ॥

కం॥ జీవుడుజీవుడనంగా * భావింపగవేరెలేడు * ప్రకృతినియుక్తుం
బైవెలయునహంకారమె * జీవుడనుచుతత్వవిదులచే * జెప్పబడున్ ॥

గీ॥ యెంచిచూడమనోత్రయపంచభూత ƒ వితతిగూడగనుపరాప్రకృతియునయ్యె
పరగతన్మాత్రలముగపరాప్రకృతిరూపు ƒ డగుచుజీవుడువిలసిల్లెనజ్ఞుడగుచు ॥

గీ॥ అరసిచూడసనాతనుడగుచునీశ్వ ƒ రాంశసంభూతుడైమనుష్యాదిసకల
జంతుజాలంబులందుండిసంచరించు ƒ నతడెజీవుడుక్షేత్రజ్ఞుడతడెదేహి ॥

కం॥ సకలోపాధులమెలగుచు * సకలంబైనట్టికర్మ * సంచయమెల్లన్
సకలవిధంబులసలుపుచు * సకలాత్మకుడనగదగి * బొసగుజీవుడిలన్॥

వ॥ చిత్తగింపు మంతఃకరణంబు । నంతఃకరణ ప్రతిబింబ చైతన్యంబును తద
ధిష్ఠాన చైతన్యంబు నినిమూడునుంగలసి జీవుండనఁ బయ్యె । నాజీవుండొక
వేళ్ల నంతఃకరణంబునుం గూడెనేని విశ్వరూపంబున స్థూలదేహంబునం బొంది
తమోగుణప్రధానుండై సకల విషయ ప్రవర్తకత్వంబు బూని యతిచంచ
లుండై యుండు । నంతఃకరణ ప్రతిబింబ చైతన్యంబునుం గూడెనేని తేజోరూ
పంబున సూక్ష్మ దేహంబునుంబొంది రజోగుణప్రధానుండై జ్ఞప్తిమాత్రవ్యాప
కత్వంబుబూని యరుక మరుపులుం గలిగియుండు । మరియు తదధిష్ఠాన చైత
న్యంబును గూడెనేని ప్రజ్ఞారూపంబున కారణ దేహంబుతోఁగూడి సత్వగుణ
ప్రధానుండై నిశ్చేష్టితుండై జడత్వంబునునుండు । నిట్టిజీవతత్వ లక్షణం బెట్లం
టేని । పంచభూతంబులును । పంచవిషయంబులును । పంచకోశంబులును ।
పంచప్రాణంబులును । పంచజ్ఞానేంద్రియంబులును । పంచకర్మేంద్రియంబు
లును । పంచవర్ణంబులును । దేహత్రయ । అవస్థాత్రయ । జీవత్రయ ।
మలత్రయ । కరణత్రయ । కర్మత్రయ । తాపత్రయ । వాసనాత్రయ ।
ఈషణాత్రయంబులును । అంతఃకరణచతుష్టయంబును । హానివృద్ధి యశోలా
భంబులును । కామాదిషట్కంబును । షడూర్ములును । షడ్భావ వికారంబు
లును । వుత్పత్తిస్థితి లయంబులును । స్త్రీపుంన్నపుంసక నిన్నయంబులును।
ఆచారానాచారంబులును । ఆదిమధ్యావసానంబులును । నానాభేదంబులును।
నానావాదంబులును । నానావినోదంబులును । నానావైచిత్ర్యంబులును ।
నానా వేదంబులును । నానాశాస్త్రంబులును । నానాపురాణంబులును ।
నానాయితిహాసంబులును । నానామంత్రంబులును । నానాయంత్రంబులును।
నానాతంత్రంబులును । నానాకులంబులును । నానామతంబులును । నానా
శ్రమంబులును । నానావ్యవహారంబులును । అష్టమదంబులును । అష్ట పాశం
బులును । అష్టైశ్వర్యంబులును । అష్టకష్టంబులును । సప్త వ్యసనంబులును ।
పుణ్యాపాపంబులును । సుఖదుఃఖంబులును । స్థావరజంగమంబులును । సంశ
యనిశ్చయంబులును । జ్ఞానాజ్ఞానంబులును । కారణకార్యంబులును । ధర్మా
ధర్మంబులును । గర్వాభిమానంబులును । లజ్జా భయంబులును । సహ్య

సహ్యంబులును । సత్యాసత్యంబులును । అల్పాధికంబులును । రాగద్వేషం
బులును । దయానిర్దయలును । దేశ కాలవస్తు దేశంబులును । నామరూ
పనిరూపణంబులును । నియమానియమంబులును । శుభాశుభంబులును ।
స్వతంత్ర పారతంత్ర్యంబులును । కర్తృత్వ భోక్తృత్వాది సహితంబై విలసిల్లు
నని చెప్పి మరియు నిట్లనియె ॥

గీ॥ తనువు నేనటంచు తనరూపమెరుగక ‡ నజ్ఞుడగుచు నింద్రియములగూడి
వలసినట్టులెల్ల వర్తించుకొనుచుండు ‡ వాడె జీవుడనగ జూడనయ్య ॥

మ॥ అడరన్ దేహనియుక్తుడై ‡ కడువికారాహంకృతుండైన జీ
వుడు నంతఃకరణాదివృత్తులను ‡ దాబొల్పొందగా గాంచి దాప్రా
జ్ఞుడనే గాంచితి నేను వింటి ‡ నిజమంచున్ మోహసంయుక్తుడై
కడు విభ్రాంతి వహించి వర్తిలు ‡ మహాగర్వంబు వాటిల్లగన్ ॥

కం॥ వినురజ్జు సర్పంబను ✻ కొనుగతి నయ్యందు జీవ ✻ గుణభావనచే
పనిబడి భయకంపాదిక ✻ మును జెందుచునుండు పరమ ✻ మూఢుండగుచున్ ॥

ఉ॥ సారవిహీనమై దురిత ‡ సంకులమై బహుజన్మమూలమై
పారము లేని సాగరము భంగి ‡ భయప్రదమైన యట్టి సం
సారము మిథ్యగా దెలియ ‡ జాలక దారసుతాదులెల్ల నా
వారని నమ్మి మోహమున ‡ వర్తిలుచుండెడివాడె జీవుడున్ ॥

కం॥ జీవుడు జీవుడనంగా ✻ భావింపగ వేరలేదు ✻ ప్రకృతినియుక్తం
బై వెలయు నహంకారమె ✻ జీవుడనుచు తత్త్వవిదులచే ✻ జెప్పబడున్ ॥

గీ॥ యెంచిచూడ మనోత్రయ పంచభూత ‡ వితతిగూడగను పరాప్రకృతియునయ్యె
పరగ తన్మూలముగ పరాప్రకృతిరూపు ‡ డగుచు జీవుడు విలసిల్లె నజ్ఞుడగుచు ॥

గీ॥ అరసిచూడ సనాతనుడగుచు నీశ్వ ‡ రాంశసంభూతుడైన మనుష్యాదిసకల
జంతుజాలంబులందుండి సంచరించు ‡ నతడె జీవుడు క్షేత్రజ్ఞుడతడె దేహి ॥

కం॥ సకలోపాధుల మెలగుచు ✻ సకలంబైనట్టి కర్మ ✻ సంచయమెల్లన్
సకలవిధంబుల సలుపుచు ✻ సకలాత్మకుడనగదగి ✻ పొసగు జీవుడిలన్ ॥

గీ॥ మనమునిశ్చలమై యీశుడనగబరగు ♦ మనము చంచలమై జీవుడనగబరగు
నందువిరువురగులు వివేకావివేక ♦ ములప్రవర్తించు నరసుతుమూర్ఖుడగుచు॥

సీ॥ నరసాన్నవస్త్రాది సకలదానంబులు ♦ సలుపుచుమిగుల సౌజన్యుడగుచు
శాస్త్రపురాణముల్ చదువుచు చెప్పుచు ♦ తీర్థయాత్రలనెల్ల దిరుగుకొనుచు
జపతపోధ్యాన పూజలనొనరింపుచు ♦ నామకీర్తన భజనలగరపుచు
సత్యవర్తనముచే సద్వృత్తినుండుచు ♦ బహుంతరయోగ సంపన్నుడగుచు ॥

గీ॥ దేవఋషిపితృరుణములు దీర్చుకొనుచు ♦ వేదశాస్త్రసత్కర్మ వేదియగుచు
వెలయుచుండువివేక చంచలముచాత ♦ జీవుడీలాగురెండవదేవుడగుచూ॥

గీ॥ అరయమదమత్సరాదులు యోగడములు♦ హత్యలనృతంబులపకార కృత్యములును
మొదలుగాగల దురితంబులొదవుచుండు ♦ జీవుడవివేకచంచల శీలుడగుచూ॥

గీ॥ దేహమునదనుగూడి తెలివొందుచెంమ్మది ♦ యందువలనదోచు నఖిలమెల్ల
తెలివిజీవగుణము దేహంబుజడుడాక ♦ బోవదెవరికైన పుణ్యచరితా॥

కం॥ దేవుడుతానై వేరొక ✻ దేవునిగొనిదాసుడగుచు ✻ దీనత్వముచే
ధావంతిమొందునాతడు ✻ జీవుడువిభ్రాంతుడనుచు ✻ జెప్పెదురార్యులూ॥

గీ॥ పరగక్షేత్రజ్ఞుడన చిదాభాసుడనగ ♦ దనరచిత్ప్రతి బింబచైతన్యమనిన
ప్రాణిదేహియు నంతఃకరణములనిన ♦ జీవపర్యాయ శబ్దంబులై వెలయునూ॥

గీ॥ నరయవిశ్వంబు తైజసుండనగ ప్రాజ్ఞ ♦ డనెడినామంబులను భేదమలరదాల్చె
నమలకూటస్థ ప్రతిబింబమంతటికిని ♦ మూలమావిద్య కోపాధిజాలమయ్యె॥

కం॥ ఇదిగాకనిందుమీదట ♦ విదితంబుగనీవిధంబు ✻ వినరింపబడున్
మునమునసీశ్వరతత్వము ✻ మదికేర్పడవినుము ✻ పరమమగ్నంబనఘా ॥

—(✻) యీ శ్వ ర త త్వ ము . (✻)—

సీ॥ బ్రహ్మచారిగృహస్థ పరగవానప్రస్థ ♦ యతియనననేక దేహముగనాల్గు
భేదంబులెట్లుగనిపించునో అటువలె ♦ చిత్తుదంతర్యామి చెన్నుమీర
సూత్రాత్మ ముదిరాట్టు సారదిగానిట్లని ♦ నాల్గునామంబుల వెల్గుచుండె

నిందులో నామంబు లీశకొన్న జనియించె ♦ నిన్ని ప్రకారంబు లేకమైన

గీ॥ ఆదిచిద్బ్రహ్మ తేజంబునంద దోచె ♦ నరశిచూచిన నాతత్త్వమద్వయంబు
గానిమాయ వసగూడిన కారణమున ♦ బహువిధంబులగన్పించె ప్రకటముగనూ ॥

సీ॥ ఆదిని తెల్లనిదై ధౌతవస్త్రంబు ♦ కరకబెండినదయ్యె ఘట్టితంబు
అచ్చులువేశిన నదిలాంఛితంబయ్యె ♦ నద్దినరంజితం బయ్యెనటుల
పరమాత్మమాయలో ప్రతిబింబితుండైన ♦ నంతనంతర్యామి యనెయ్యెనకల
సూక్ష్మాభిమానియై సూత్రాత్మయగు ♦ జగద్రూపుడై ఘనవిరాడ్రూపుడయ్యె ॥

గీ॥ యిట్టులొకడైన యాత్మని జేచ్ఛవలన ♦ నిలవశీకృతమాయుడై యీశ్వరాఖ్య
బూనిసర్వేశ్వరత్వాది భూరిగుణము ♦ లతులలక్షింపహింప్ప దాయలరుచుండూ ॥

వ॥ మరియు మాయాధిష్ఠానచైతన్యంబును । మాయాప్రతిఫలిత చైతన్యంబును
మాయయు యీమూడునుంగూడి ఈశ్వరుండనంబడు । నయ్యీశ్వరుండు వశీ
కృతమాయుండు గావున దానకర్తయగుచు ననేక బ్రహ్మాండంబులు సృజిం
పును । సర్వజగదుత్పాది గుణవిశిష్టుండై స్వస్వరూప విస్మృతింబారయక । జగ
ద్వ్యాపకుండై అంతర్యామి హిరణ్యగర్భ విరాట్టులను నామంబుల వెలయు
నదెట్లంటేని సమష్టికారణ శరీరాభిమానంబు గలవాడై యంతర్యామి యనం
బడియె । సమష్టి లింగశరీరాభిమానంబు గలవాడై హిరణ్యగర్భుడనియన్ని ।
సూత్రాత్మయనియన్ని నామద్వయంబుగలవాడయ్యె । సమష్టిస్థూల శరీరాభిమా
నయుక్తుండై విరాట్టను నామంబున వ్యవహరింపంబడియె । నట్లుసమష్టి సుషు
ప్త్యభిమానోపాధవలన నీశ్వర చైతన్యంబునకు నంతర్యామి నామంబును ।
సమష్టి స్వప్నావస్థోపాధివశంబున హిరణ్యగర్భ సూత్రాత్మనామంబులును ।
సమష్టి జాగ్రదవస్థోపాధి వంశంబున విరాట్టనునామంబు నింతియకాని యీ
స్వభావసిద్ధంబులుగాకుండు । నితండు వశీకృతమాయుండైన సర్వేశ్వరుండు
గావున జాగ్రదాద్యవస్థలకు కారణశరీరాది దేహత్రయంబునకు వ్యవహర్త
యయ్యు తత్సంబంధి సుఖదుఃఖంబులనంటక నిజానందనిమగ్నుండై విశ్వరూప
కుండై విశ్వకర్తయై విశ్వభోక్తయై కర్తృత్వ భోక్తృత్వంబులంబారయకుండు

నాకాశంబున నీలపీతాది వర్ణంబులు దోచినభాగి నతనియందు నంతర్యామి హిరణ్యగర్భ విరాట్టులను నామంబులు భ్రాంతి కల్పితంబులని యెరుంగుము । భ్రాంతికి కారణంబు త్రిగుణాత్మకంబైన మాయ దప్ప నన్యంబు లేదు । నామాయయే మూలప్రకృతి యనంబడు । నామూలప్రకృతి విద్యావిద్యలను రెండు దెరంగులయ్యె । నందు విద్యయను ప్రకృతి ఈశ్వరోపాధికంబయ్యె । నవిద్యయను ప్రకృతి జీవత్వోపాధికంబనయ్యె । కావున నివియెల్ల నొక్క పరమాత్మగా నిశ్చయింపుము ॥

ఉ॥ భవ్యవిద్యాపరమైనయట్టి నిజ చిద్బ్రహ్మప్రకాశంబుదా
దగు ముఖ్యేశ్వరుడైక్యంబులన్ నంతర్యామియై మాసితం
బుగ నవ్యక్త మహాభిధానుడయి విస్ఫూర్తి జగత్కారణా
ఖ్యగుడై వర్తిలుచుండు సర్వగతుడై యాత్మ విచారింపగన్ ॥

సీ॥ గురుకృపారహితులౌ నరులకగోచరు డగుట నవ్యక్త సమాఖ్య నొందె
లోకములందు సర్వోపాధులను వెలిగించు నంతర్యామి యనుచు దాల్చి
సకలలోకములకు జననస్థలంబౌట నిల జగత్కారణాహ్వయము దాల్చి
సకలంబు జేసి చేయకనుండి వేరొక విధి జేసి ఈశ్వరాభిధ వహించి

గీ॥ సకలకారణాంగ సంచయంబున కెల్ల సకలసుషుప్త్యవస్థలకును మిగుల
నరయ సకలమైన యానందమయకోశ ములకు తిడభిమానమున నెసంగ ॥

గీ॥ యీ సమష్ట్యుపాధి భాసకుండు విమల సత్వగుణవిశేష సంగతుండు
సతడు సూక్ష్మాత్మ సూక్ష్మసృష్టిలయస్థాన మను మనానతెచ్చి రార్యజనులారా ॥

సీ॥ విజ్ఞానమయకోశము మనోమయకోశ మును జ్ఞానమయకోశమనెడి మూడు
నయ్యె లింగశరీర మాసర్వలింగాగ మలయ నహంకృతి గలదుమండి
బహువిధ సృష్టికావస్థలగు సమష్టి ప్రాణావకోశక త్రయమునందు
మమకారము వహించి మాటిమాటికి నాది నాదినాద నెటి చందంబు బూని

గీ॥ ఘనరజస్సత్వగుణయుక్తి గలిగి సకల స్థూలసృష్టిలయస్థానలీల దాల్చి
ప్రాణుడను నామమున మహిరణ్యగర్భ సంజ్ఞ సూత్రాత్మయను పేరజరుగుచుండు ॥

౨౯. శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

సీ॥ అలరుపంచీకృతములకు నాకాశాది భూతపంచకమున బుట్టినట్టి
పంచవింశతితత్త్వ సంచయయుక్తమై స్థూలదేహంబిట్లు సొరదిమీరు
నాసమష్టిస్థూలకాంగ సంఘమునందు సర్వాంన్నమయకోశ సమితియందు
బహువిధజాగ్రదవస్థాతతులయందు పూర్ణాభిమానంబు బూనియుండు

గీ॥ సత్త్వమిశ్రరజస్తమ స్సక్తుడగుచు సర్వకాలంబులందు వైశ్వానరాఖ్యు
డనవిరాణ్ణామకుండన వారునిదియు పాధిభేదంబుగాని నిబద్ధిగాదూ॥

ఉ॥ యెవ్వనియాజ్ఞచాతదివ సేశుడొనర్చ్పునను కాలనిర్ణయం
బెన్వనియాజ్ఞచేత విబుధేంద్రు డొనర్చు నలోకరక్షణం
బెవ్వనియాజ్ఞచే పవనుడెల్లెడలం జెరియించునిచ్ఛగా
బెవ్వనియాజ్ఞభూమి ఫలియింపును నుండతడీశ్వరుండగునూ॥

మ॥ వనజాతాసనుడైరజస్స్థితి జగద్వ్రాతంబు బుట్టింపుచున్
ఘనసత్త్వాకృతి విష్ణురూపమున లోకంబెల్ల పాలింపుచున్
దనరంతామసవృత్తి రుద్రుడయి తన్నాశంబుగావించునా
తని పేరీశ్వరుడంచు బల్కుదురు పెద్దల్ యుక్తులన్ సూక్తులన్॥

గీ॥ అఖిలభూతాళి హృదయాంబుజాంతరాళ దేశమున జేరి మాయదాదేజరిల్లు
గానవంతివిగారిగా దాని జేశి యేమిజేయనియట్లుండు నీశ్వరుండూ॥

ఉ॥ భూరివరోల్లసద్గుణసమూహాము కానుక జేయుచున్మహో
దారగుణాంగిమాయ సతతం బెడబాయకనన్యమైనయా
ధారములేని చేతన పదంబులు బట్టినదానిదాసిగా
నేరహిజేయునీశ్వరుడునిర్గుణ మార్గములిట్టివేకదా॥

శా॥ శర్వేంద్రాచ్యుత కంజజాగ్నియమ భాస్వచ్చంద్ర నక్షత్రగంధ
ర్వాదిద్యాకృతిబూని సేవకుల నానాకామముల్ నింపుచున్
సర్వజ్ఞత్వముసర్వ శాసనకళా సాహిత్యచాతుర్యముల్
సర్వేశత్వము నిర్వహించెతడై శ్వర్యంబవార్యంబుగనూ॥

గీ॥ మొనయుజీవతత్వమున కధిష్ఠానమై ♦ ఈశ్వరాఖ్యతత్వమేరుపడియె
నరసిచూడదీని కాధారముగనాద్య ♦ మగుచిదాత్మతత్వ మదిగ్రహించూ ॥

—(*) చిదాత్మతత్వము. (*)—

సీ॥ మునుసమస్తంబునకునతీతమై ♦ మనోవాక్కులచేగన వశముగాక
శూన్యంబునకుమహా శూన్యమైపరమమై ♦ హృద్యమై విబుధ సంవేద్యమగుచు.
దగుకేవలాత్మసత్తామాత్రచైతన్య ♦ మైతదంశస్ఫూర్తి నావహిల్లి
యాయంశమును సచ్చిదానందములుగూడి ♦ అరయగాచిద్రూపమైజనించె
గీ॥ నదిపరబ్రహ్మ పరమాత్మ సదమలాత్మ ♦ ప్రత్యగాత్మయు బోధాత్మపదములనగ
సాక్షిచైతన్యమనగ ప్రజ్ఞానమనగ ♦ నేతదభిధానములుగల్గి యేకమయ్యె ॥

కం॥ జీవేశ్వరతత్వములకు * వావిగామీదనుండి * వాటిదెలియుచు(న్)
భావింపబుద్ధిగోచర * మైవెలయుచిదాత్మతత్వ * మతినిజమలరనూ ॥

కం॥ అణువునకు నెన్ననికిలి * యణువగుచుమహాత్తునకు * మహాత్తగుచు వెన్సన్
గుణవర్జితమగుచునుకా * రణమగుచుచిదాత్మబరగు * రంవ్యంబెసగనూ॥

గీ॥ సర్వస్థూలమగుచు సర్వంబునగుచును ♦ సర్వసాక్షియగుచు సర్వసార
మగుచుసర్వపూర్ణ మగుచుభాసిలుచుండు ♦ నదిచితాత్మయనగ నలరుననఘా ॥

కం॥ సత్యంబైనిర్మలమై * నిత్యంబైసకలతత్వ * నిజసారంబై
శృత్యుక్తస్ఫురణంబై * ప్రత్యక్చైతన్యమనగ * రంజిలుచుండన్ ॥

వ॥ విను చిదాత్మయు నిరాకారంబును । నిర్వికారంబును । నిర్గుణంబును । నిర్వి
భేద్యంబును । నిర్వివాదంబును । నిరంజనంబును । నిరవద్యంబును । నిరుప
మానంబును । నిష్ప్రపంచంబును । నిస్థూలంబును । నిశ్శబ్దంబును । నిష్కళం
కంబును । నిస్సంకల్పంబును । నిర్దోషంబును । నిర్లేపంబును । నిత్యశుద్ధ
బుద్ధపరిపూర్ణంబును । నిత్యానిత్యవస్తువివేకకారణంబు నఖండంబు నద్వ
యంబు ననాద్యంబు ననంతంబు నవ్యక్తంబు నగోచరంబు నప్రతర్క్యంబు
నమితంబు ననిరుద్ధంబు నలక్ష్యంబు నగణితంబు నచింత్యంబు నమృతంబు నని

యమంబు నధ్యానంబు నమంత్రంబు నపూజనంబును నవానిశ్చయ హేతృత్వంబు సర్వప్రకాశకంబును । సర్వసాక్షియును । సర్వోపనిషత్ప్రతిపాద్యంబును । సర్వసమ్మతంబును । సత్తామాత్రంబును । సచ్చిదానంద రూపంబును । సత్యంబును । సంవిత్పదంబును । సూక్ష్మాత్సూక్ష్మంబులును । ఉన్నతోన్నతంబును పరంబును । పరాత్పరంబును । పరమ పావనంబును । పరమ సుఖాతిశయంబును । పరమయోగంబును । పరమార్థంబును । పరబ్రహ్మంబును । దేశకాలవస్తుపరిచ్ఛేదరహితంబును । మహానిత్యంబును । మహావినాశకంబును । చిదాకాశంబును । జగదుత్పత్తి స్థితిలయమూలంబును । జగద్వ్యాపకంబును । భూతభవిష్యద్వర్తమాన సాక్షియును । వృత్తమోత్తమంబును । వృన్మనియును మనోన్మనియును । ప్రజ్ఞాన చైతన్యంబును । కార్య కారణ కర్తృత్వ భోక్తృత్వాది రహితంబును । కేవలంబును । మహాతత్త్వంబునై ఏకంబగుచుండును ।

గీ॥ జలఘటంబులందోచు భాస్కరునిభంగి ♦ నగణితాజాండ పంక్తులయందుబర్వి
లోన వెలుపలననకను తానె వెలుగు ♦ ఖండమనిలేనాత్మ యఖండమగుచు॥

గీ॥ మెరుకలకు నెల్ల మూలమై మెరుగబడుచు ♦ బ్రహ్మలందెల్ల నుండి చిద్బ్రహ్మమగుచు
సర్వమున నెల్ల పూర్ణమై సర్వసాక్షి ♦ రూపమగు ప్రత్యగాత్మ నిరూపణమున॥

గీ॥ అరశిచూడ హంస యనునట్టి కారణ ♦ వాక్యమునను గల్గు వర్ణయుగము
దీని రెంటినడిమి దివ్యతేజంబు చి ♦ దాత్మయని తలంచు మమలహృదయా॥

గీ॥ దృక్కనంగ తానె దృశ్యంబనగ తానె ♦ దృక్కుదృశ్యముల నతిక్రమించి
ద్రష్టయనగ నెన్న దగు తానె సర్వమై ♦ వెలయు ప్రత్యగాత్మ వేరులేక॥

గీ॥ స్థూలసూక్ష్మములకు సారది కారణమునై ♦ కార్యకారణముల కర్తయగుచు
సగుణనిర్గుణముల సాక్షియై వెలయు ♦ చిద్బ్రహ్మతేజమెప్పుడు బాయకుండు॥

గీ॥ జ్ఞానములకెల్ల నుత్తమజ్ఞానమగుచు ♦ తత్త్వములకెల్ల నుత్తమతత్త్వమగుచు
తేజములకెల్ల నుత్తమ తేజమగుచు ♦ దనరియుండును చిద్బ్రహ్మ తత్త్వమనఘా॥

కం॥ సత్యజ్ఞానమనంతం * బత్యంతానందమమల * మద్వయమగుచున్

నిత్యంబై నిఖిలంబై * ప్రత్యక్చైతన్యమిటుల * భాసిలుచుండునూ ॥

గీ॥ యిది చిదాత్మతత్త్వమిక కేవలాత్మత ♦ త్త్వంబుగలగు తద్విధంబు దెలియ
నగున దెట్టిదన్న విన మహాపరమార్థ ♦ మేర్పరించిమదికి నెరుక జేతు ॥

## వివేకచంద్రిక.

శ్లో॥ చిద్రూపబ్రహ్మమాత్రోహం ♦ మభిన్నస్య స్వవర్జనాత్
యత్నస్తదవబోధాయ ♦ క్రియతేయం సుధీమతాః ॥

సకలమునైనజనులు తుచ్ఛసుఖార్థమయ్యేవే సమస్త ప్రయోజనముల యందు ప్రవర్తిస్తున్నారని యేమిచెప్పవలెను । అదిగనుక అధికారులైన వారికి అనాయాసంగాను నిత్య నిరుపద్రవ బ్రహ్మానంద సుఖప్రాప్తికి సాధనమైన వివేకచంద్రికఅనే గ్రంథము చెయ్యబడుచున్నది । ఆప్రకారము యెట్లన్నను । సాధనసంపన్నుండైన విమలచిత్తుడనే శిష్యుండు ప్రబోధచంద్రుడనే గురువును రహస్యమందు భక్తియుక్తుండై । నమస్కరించి వోస్వామీ । యీ సంసారసాగరమును యేరీతినిదాటవచ్చునని యడిగిన । దయాశాలియైన ఆమహా గురువు । ఆశిష్యున్ని గురించి అంచున్నాడు । వో యీనీవు మహాబుద్ధిమంతుండవున్న । గొప్పపుణ్యాత్ముడవున్న । అనేక జన్మములయందు ఫలాసక్తిలేక నిత్యనైమిత్తికాది కర్మములను బ్రహ్మార్పణంగా చేసినందుచాల విశుద్ధమైన చిత్తముగల్గిన యోగ్యుడవు గనుక । పాపాత్ములు దేహాత్మవాదులు । ఈశ్వర ద్రోహులు । అతిదుఃఖ సంసారగభీరకూప నిమగ్నులు । పరవంచనాసక్తులు । కామమోహితులు అయిన । యీలాటివారికి శక్యముగానటువంటి వృత్తము మైన ప్రశ్న చేస్తివి । యీప్రశ్నవల్లను । వేము మహాసంతోషించి నీకు సంసార నివర్తకమైన ఉపాయము ఉపదేశిస్తున్నారము వినుము । బ్రహ్మజ్ఞానము సంసారము పోమొత్తే సాధనము । యీబ్రహ్మజ్ఞానమునకు ముఖ్యసాధన వివేకమనే యీప్రకారాన ఉపదేశము శాయగా శిష్యుండైన విమలచిత్తుడు

తిరగా ప్రశ్న చేస్తున్నాడు । యేమని అంటెను । బ్రింహ్మాజ్ఞానము సంసార నివర్తకము । దీనికిసాధనము వివేకమని ఉపదేశిస్తిరి । బ్రహ్మామనగా యేమిటిది। సంసారమనగా యేమిటిది । ఆబ్రింహ్మామందు యీసంసారం యెందువల్లపుట్టుచున్నది । వివేకమనగా యేమిటిది । అనియీలాగున ప్రశ్న శాయగా । వోయీ నీవువిమలచిత్తుడన్న నామమునకు తగుదువుఅని శ్లాఘించి యీప్రశ్నలకు నిస్సందేహముగా తెలుపుచున్నారము । బ్రహ్మామన్నది యేమిటిదనిఅం అడిగితివి । బ్రింహ్మాస్వరూపము నిరూపిస్తున్నారము । వినుమూ । వాక్కులచాత చెప్పశక్యముగాక మనస్సుచాత తెలియబడక ఉత్పత్తిస్థితి లయములు లేక । అఖండమై । లోపు బయలులేక । యేదిక్కులేక । విషయానుభవము లేని సుఖస్వరూపమైన తెలివిమాత్రిమై । దేశకాలములచాత కొంచముగా చెయ్యబడక సదా స్వయం ప్రకాశమానమై । జాగ్రిత్స్వప్న సుషుప్తులకు సాక్షియై । అబాధ్యమై । సమస్తప్రపంచ వివృత్తిదశకు సాక్షియై । చరాచరప్రిపంచమంతా సద్రూపమై నిండుకొనివున్నవస్తువ బ్రింహ్మాము । సంసారమనగా యేమిటిదనియడిగితివి । సావధాచిత్తుండవై వినవోయి చెప్పుచున్నారము । అఖండనిజానంద స్వరూపమని యెరుగక । మాయాప్రభవమైన దేహేంద్రియాది ప్రపంచమే తానని కామక్రోధాన్వితుడై అస్థిరమైన దేహానకు స్థిరత్వముకోరుకొంచూ । వాయువుచాతను చెలంచెటి తరంగములతో గూడిన సముద్రము వలె సంక్షోభిస్తూ । అశాశ్వతమైన దారాపుత్ర ధనపశ్వాదికమందు అభిమానముచాత బద్ధుడై సదసద్వివేకములేక వుండే పురుషుని యందువున్న అహంకారానస్థ సంసారము । యీసంసారము బ్రింహ్మాయందు యందువల్ల బుట్టాచున్నదని అడిగితివి చెప్పేమువినుము । అవివేకము చాతను బుట్టినది । అవివేకమనగా వివేకముచాత కొట్టుబడేది । వివేకమనగా యేమిటిదనిఅడిగితివి । చెప్పుచున్నారము వినుమూ । వివేకమనగా అంతఃకరణాది ప్రపంచమునకుసాక్షిగా వేరుగా ఆత్మానుభవము గలుగుట । యీవక్కవివేకమునే । మందబుద్ధులైనవారియందు అనుగ్రహించాతను । దృగ్వివేకమనిన్ని ।

పంచకోశ వివేకమనిన్నీ । పంచభూతవివేకమనిన్నీ । నామరూపవివేకమనిన్నీ । తత్వవివేకమనిన్నీ । అయిదుప్రకారములుగా బ్రహ్మవేత్తలైన మహాత్ములు పురాణములయందున్నూ । బృహదారణ్యకా ద్యుపనిషత్తులయందున్నూ । గురుశిష్య సంవాదరూపముచాత కట్టడిచేశి సుఖబోధకొరకు నిరూపించినారు। ఆమహాత్ములు ఉపదేశించినప్రకారము నీకు ఉపదేశిస్తున్నాము । అత్యాసక్తి చాత వినవోయి । ముందుగా దృగ్దృశ్య వివేకము నిరూపించబడుచున్నది । దృక్కనగా చూచేనేత్రము । దృశ్యమనగా చెవులవినబడే శబ్దము । కంన్నుల చాతచూడబడే రూపమున్ను । యీలాగునే । గంధము రసము స్పర్శ । కుండ మొదలైన ద్రవ్యాదులున్ను । దృశ్యాలని తెలియవలెను । యీదృక్కు రెండు విధములు । యెట్లువలెనంటేను । నశించేదృక్కనిన్ని । నిత్యమై నాశములేక । అనిత్యములైన । అంతఃకరణమొదలుకొని । స్థూలబ్రహ్మాండము అంతముగా కలిగిన దృశ్యములయొక్క ఉత్పత్తిని స్థితిని ప్రళయమును । చూచుకొనుచు । తనకంటే అన్యమై అసత్యమైవుండే బుద్ధ్యాదులచాత ప్రకాశింపబడక । తానే వెలుగుచూవుండే తెలివిమాత్రమనిన్ని । యీ తెలివిరూపమైన దృక్కే కూటస్థమనిన్నీ । ప్రత్యక్చైతన్యమనిన్ని । ఉపాధితో కూడుకున్న బ్రహ్మస్వరూపమనిన్ని । ఆత్మయనిన్ని । సాక్షియనిన్ని । యీశాస్త్రమందు చెప్పబడుచున్నది అద్వైతాత్మబోధకొరకుయీగ్రంథముచాయబడుచున్నది యీదృక్స్వరూపము విచారించడానకు సాధనమైన అంతఃకరణ స్వరూపము విచారించబడుచున్నది। అంతఃకరణమనగా యేమిటిదంటే । సత్యమనిన్నీ । అసత్యమనిన్ని । సత్యాసత్య స్వరూపమనిన్ని చెప్పగూడదని । అదియెట్లువలెనంటే । సత్యమని చెప్పగూడదు । సాక్షి అయినఆత్మ స్వరూపముచాత కామక్రోధాదివృత్తిరూపమై తెలియబడుచున్నది । గనుకను రెండున్నని చెప్పగూడదు । విరోధముగనుకను బ్రహ్మస్వరూపమని చెప్పగూడదు । జడముగనుకను । బ్రహ్మకంటె వేరైన । సత్యమైనపదార్థమే లేదు । గనుకనున్ను । అదిగనక చెప్పగూడదనే చెప్పవలెను । అట్లైతేను యీకారణము స్వతంత్రమూ అస్వతంత్రమూ అంటే రెండువిధములని చెప్పవ

లెను । యీ అర్థమందు దృష్టాంతము । యినుము కత్తి మొదలైన కార్యముల
బుట్టించేటప్పుడు అగ్ని సంబంధములేక నానావిధములు కానేరవుగనక అస్వతం
త్రము । తనయందునిండినటో వేరుగా తెలియగూడకుండా నిండివున్న అగ్నికి
సమ్మెట పెట్లుపడ్డట్టుగా తనుసాగివిరితే అగ్ని సాగివిరిగినట్టుగా అవివేకులయిన
పురుషునికి భ్రాంతిని పుట్టించేది గనక స్వతంత్రము । యిటువలెనే ఆత్మచేత తెలి
యబడుచున్నదిగనక అస్వతంత్రము । అసంగమైన ఆత్మను కర్తృత్వ భోక్తృ
త్వాది వికారములుకలవాటివలె తోపచేస్తున్నదిగనక స్వతంత్రము । యీ కా
రణము చిత్రపటము వలెనే సంకోచావస్థయందు జగత్తు లయించడమున్ను ।
వికాసావస్థయందు జగత్తు వుండచెయ్యడమనే అవస్థలు రెండుకలదై వుండును।
యీ కారణమే మాయఅని అవిద్యయని రెండువిధములు । సత్వగుణప్రధానమై
మాయఅనిపేరుగలిగి తనయందు ప్రతిఫలించిన బ్రహ్మచైతన్య ప్రతిబింబ
రూపమైన ఈశ్వరునికి స్వాధీనశక్తియై సకలసృష్టికి సాధనమై వుండును । రజ
స్తమోగుణములతో మిశ్రమమైన సత్వగుణము అంతఃకరణమని అవిద్యయని
పేరుగల్గి తనయందు ప్రతిఫలించిన బ్రహ్మప్రతిబింబ రూపమైనజీవునికి జాగ్ర
దవస్థ మొదలుకొని మోక్షము అంతముగాకలిగిన సృష్టికి సాధనమైవుండును ।
యీబంధములకు కారణమై వుండును । అది యెటువలెనంటే । పరిపూర్ణమై
అఖండమై చిద్రూపమైన బ్రహ్మము తన ప్రతిబింబరూపమైన ఈశ్వరునితో
గూడుకున్న మాయా సంబంధంచాత జగత్స్వరూపుడై భోజ్యరూపుడై
వుండును । తనప్రతిబింబరూపుడైన జీవునితో గూడుకున్న అవిద్యాసంబం
ధముచాతను భోక్తయై వుండును । అవిద్యామాయా రెండుతననిజబోధజ్ఞానము
చాత నివర్తించుచుండగా అద్వితీయాత్మ మాత్రుడై వుండును । యీఅద్వ
తీయానందానుభవముకు సాధనము నిరూపించుచున్నారము । వినుమా ।
పెద్దపులులు సర్పములు మొదలైన భయంకర జంతువులు లేక । యెండలేక ।
మనుష్యులు లేక । శాంతికి సాధనమై మనోహరమై రాజ చోర ప్రభృతి
భీతులు లేక ఫలపుష్పసమేతములైన వనములయందుగాని । మధురమై శీతలమై।

యిసుకదిన్నెలు మొదలైన హృద్య ప్రదేశములు గలిగిన నదీతీరమందుగాని । అశ్వత్థాది పుణ్యతరువులతో గూడుకున్న సరస్తీరమందుగాని । తనమనస్సు వచ్చినస్థలమందు యెక్కడనైనాగాని । యేకాంతమందు పట్టువస్త్రములు మొదలైనవాటిచేత రచించబడ్డ దూదిలేపులు మొదలైన ఆస్తరణములయందు సిద్ధాసనముచేతకూర్చుండి సవికల్ప నిర్వికల్ప సమాధుల భేదములు లెస్సగా తెలిసి ఆత్మానాత్మల భేదము తెలిసి వైరాగ్యము నాశ్రయించి దృగ్దృశ్య వివేకము చేయగా దృగ్రూపమైన ఆత్మమాత్రుడై యుండును । ఆత్మయనగా సదా తెలివే స్వరూపముగా కలిగి నిత్యమై ఉత్పత్తి నాశనములేక వుండే వస్తువని యెరుగవలెను । అనాత్మయనగా కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాసూయ మొదలైనవృత్తులకు కారణమైనఅంతఃకరణము బాహ్యమందు మాయారూపమైన పంచభూతములు మొదలుకొని ఘటపటాది ప్రపంచములను మాయవల్ల భూతములు పుట్టినప్రకారము పంచభూత వివేకమందు నిరూపించబడుచున్నది గనుక యిక్కడ నిరూపించలేదు । సమాధి నిరూపిస్తున్నారము । ముఖ్యము గావినుమా । సమాధియనగా అభ్యాసముచేతను పక్వమైనచిత్తము వకవస్తువయందు లయించివుండుట యీసమాధి రెండువిధములు । సవికల్పకమునిన్ని నిర్వికల్పమునిన్ని సవికల్పకమున్ను రెండువిధములు । దృశ్యమిశ్రమమని శబ్దమిశ్రమనిన్ని । దృశ్యమిశ్రమనగా యేమిటిదంటే । లెస్సగానిరూపిస్తున్నారము । దేహానికి వేరైన ఘటపటాదులు బాహ్యమందు దృశ్యములు । యిటువలెనే । యీబాహ్య వస్తువులయొక్క అభావాలున్న దృశ్యాలే । యీబాహ్యవస్తువులకున్ను వీటిఅభావాలకున్ను సాక్షియైఅజ్ఞానముచేత అచేతనాలైన దేహేంద్రియాదిస్వరూపుడై అగ్నితప్తయందు సంబంధించిన యినుపముద్దనునిండి తనరూపముగా జేసినిప్పు రాళ్ళవలెనే జడాలైన దేహేంద్రియాలను చేతనములవలె తనప్రకాశతచేత చేయుచున్న కూటస్థస్వరూపమే దృక్కని చెప్పబడును । దృక్కైన దేహేంద్రియాత్మకమైనతాను । తనచేత చూడబడే ఘటాదులచేత తెలియబడను గనుక దృక్కని చెప్పబడును । తనచేత చూడబడే

ఘటాదులు వొకవస్తువను తెలియలేక జడమై చూడబడుచూనుండేవి గనుక దృశ్యమని చెప్పబడును। యీదృశ్య బాహ్య ప్రపంచము। తానునిత్యుడను। యీసమస్తానకున్ను సాక్షినిన్ని। యీచూడబడే ఘటాదులయొక్క పుట్టడము చావడము నాచాతచూడబడుచుంది గనుక యివిదృశ్యములేఅనిన్ని। యీప్రకారాన దృగ్దృశ్య వివేకముచేశి బాహ్య దృంజ్మాత్మృణ్ని నేననినిర్ణయించి దేహములోపటానున్ను యీప్రకారాన దృగ్దృశ్యవివేకము శాయవలెను। అది యెటువలెనంటే విశదముగా చాయబడుచున్నది। బైట ఘటాది వస్తువులు దృశ్యాలువున్నవి గనుక యీదృశ్యాలకు సాక్షియైనవాణ్ని నేనని తెలియ వచ్చును। దేహములోపల దృశ్యములు లేవుగదా। యీదృశ్యములకు సాక్షి యైన ఆత్మత్వము నేనని యెట్టుగానెరుగవచ్చునవో। దేహములోపలఅహంకారము మొదలైన అంతఃకరణవృత్తులు దృశ్యాలైవున్నవి। వీటికిసాక్షియైన వాడు ఆత్మయనియెరుగవచ్చును। గనుక। ముఖ్యముగా దేహములోపలవిచారముశాయవలెను। అంతరవిచారము లేకముక్తిలేదు। గనుక। అనుభవరహితమైన వాగ్వేదాంతములు విడిచి సద్గురూపదేశముచాత అద్వైతాత్మానుభవ కారణమైన సమాధికి సాధనమైన వివేకమును శాయవలెను। అది యెటువలెనంటే। దేహము మూడు విధములు। స్థూలమనిన్ని సూక్ష్మమనిన్ని కారణమనిన్ని। స్థూలశరీరము యేదంటేను। అస్థులు మాంసము నుసి నీళ్ళు రక్తము చీము చర్మమురోమములున్ను। యీసమూహము స్థూలశరీము। దేహములో పలవుంన్న అంతఃకరణము అహంకారమనిన్ని। మనస్సనిన్ని। రెండువిధములు। అంతఃకరణముహెచ్చుకలది గనుక అద్దమువలె స్వచ్ఛమై వున్నందు చాత తనకు ఆధారమైన కూటస్థచైతన్యము ప్రతి బింబించినందుచాత ప్రతిబింబంతోకూడినంతభాగము అహంకారమని చెప్పబడును। మిగిలిన భాగము మనుస్సని చెప్పబడును। యీప్రతిబింబమున్ను ప్రతిబింబానకు నిమిత్తమైన అంతఃకరణభాగమున్ను। ఆశ్రయమైన కూటస్థచైతన్యమున్ను కలిశి వొకటిగా తోచబడ్డందుచాత కూటస్థమునకు జీవుడనే పేరువచ్చును। కూటస్థము నిర్వి

కారచైతన్యముగదా । జీవభ్రాంతియెట్లువలె వస్తున్నదనేవా । అవివేకముచాత
రావచ్చును । అదియెట్లువలెనంటెను । కాకిచిప్పయందురజితమనే భ్రాంతిపుట్టి
నట్లు । ఏకానేకచిప్పయందు వెండియనిభ్రాంతి కాకిచిప్పకులేదు ; ఆవస్తువ
చూచేఅన్యునికిగాని । యెట్లువలెనే తనకు తనయందు జీవభ్రాంతిరావచ్చునా
అనేవా । దోషసంబంధము చాతనురావచ్చును । అదియెట్లువలెనంటె । సంధి
పైత్యాది దోషములచాత । తాను గజారూఢుండుగాక । నేను గజారూఢుణ్ణి
నేనురాజుననిన్ని యీప్రకారాన బహువిధములచాత యెట్లువలె తనభ్రాంతి
తనకుతోచుచున్నదో అట్లువలెనే కూటస్థునియందు । జీవభ్రాంతిరావొచ్చును ।
అదిగనుక వివేకముతోయగా కూటస్థునికిప్రతిబింబరూపమైన జీవునికి । భేదము
తోచుచూనుండగా ఏకత్వభ్రాంతినివర్తించును । యీజీవత్వము భ్రాంతిచాత
కలిగినది గనుక మిథ్య । అదిగనుక అంతరమందువివేకము లెస్సగాతోయవలెను
అదియెట్లన్నను యీఅహంకారసంబంధంచాత మనస్సువల్లదేహము లోపటను
ఘటముపటమని యీప్రకారాన అనేకవృత్తులు పుట్టుచున్నవి నేత్రములు మూ
శి దేహములోపలవృత్తులుపుట్టుట తెలిశి వొక్క వొక్క వృత్తిపుట్టడము ఆవృత్తి
నశించడము యివిరెండు దేహానకు బైట ఘటము వుండడము లేకపోవడము యె
ట్లువలె తనచాత తెలియబడుచున్నవో అట్లువలెనే తనకంటె వేరే తెలియబడుచు
న్నవి గనుక దృశ్యాలనియనుగవలెను అనేకమైన వృత్తులను వీటిఉత్పత్తినాశన
ములను చూచేతాను దృక్కని తెలియవలెను । నశించేఅనేకవృత్తులను తెలిశే
వాడుగనుక తానునిత్యుడని తనచాతచూడబడుచూ । పుట్టుచూచస్తువున్నవృ
త్తులు అనిత్యములన్ని యీవృత్తులు తనస్వరూపము కాపనిన్ని వీటిని తెలిశే తె
లివి తనస్వరూపమని వీటిని తెలుస్తూ । వీటిచాత తెలియబడనివాడుగనుక । తన
కుతానే వెలుగుతూవుండేవాడననేనే । యీవృత్తులకుసాక్షిననిన్ని । లెస్సగా
అభ్యాసముచాత దృగ్దృశ్య వివేకము చేశి । వృత్తులు దృశ్యాలనిన్ని జడాలనిన్ని
మిథ్యా స్వరూపాలనిన్ని యెరుగవలెను । యీప్రకారానే ఏకదినమందు
నైన । వృత్తులకు । ఏకమాసమందైన వృత్తులకు । ఏకసంవత్సరమందైన

వృత్తులకు ॥ ఏకయుగమందైన వృత్తులకు । ఏకబ్రింహ్మాండమున్ను । యిటువ
లెనే అనంత బ్రంహ్మాండాలకుసాక్షిని । ఉత్పత్తినాశనములు లేని వాణ్ణిగా యె
రగవలెను । యిదేదృశ్యమిశ్రసమాధియని చెప్పవలెను । యీదృశ్యమిశ్రసమా
ధికి । వివర్తకమైన శబ్దమిశ్ర సమాధి నిరూపిస్తున్నారము । మహాత్ములై
న గురువులు తనకు వేదాంతోపదేశము చేశేటప్పుడు ఆత్మకు అసంగత్వము
అనీశ్వరత్వము । అజీవత్వము । కించజ్ఞత్వము సర్వజ్ఞత్వము । కర్తృత్వము
భోక్తృత్వము । భోజ్యత్వము । సాక్షిత్వము యీధర్మములన్ని । మాయవల్ల
వచ్చినవని ఉపదేశించిరి । ద్రష్ట దర్శన దృశ్య రూపమైన త్రిపుటి నశించక
యీధర్మములు పోవని అసంగ పరిపూర్ణానంద చిద్రూపమైన బ్రహ్మమం
దు భోక్తృభోజ్యాది వికారములు లేవు గనుక నిర్వికారుడై నందుచేత చూచే
వాణ్ణినేను చూడబడేది అంతఃకరణాది ప్రపంచములు అన్న రెండుమాటలు
విడిచి । బయిలుతోచక । లోపలవృత్తులు చూడబడక । శూన్యమున్ను తోచ
క వుండే యీయేకమాత్రము బ్రంహ్మమనిన్ని యీప్రకారాన సాక్ష్యను
భూతి చేస్తు శబ్దముల త్రిపుటినివృత్తికొరకు । తెలుచుట శబ్దమిశ్రసమాధియని
చెప్పబడును । యిటుమీద నిర్వికల్ప సమాధి నిరూపించబడుచున్నది నిర్వికల్ప
మనగా యేమంటె । చూచేవాణ్ణినేను । చూడబడేదిప్రపంచము యిదిప్రపం
చమన్న అంతఃకరణ వృత్తి యీమూడూగల్గినత్రిపుటిలేక నిద్రవలెనే యేమీ
తెలియబడక నిద్రగాక దేహముతెలబడక యుండేఅవస్థ నిర్వికల్పము సమాధి
యందు బాహ్యమందునైనా ఘటపటాదివృత్తులు లేక లోపలఅహంకారాది వృ
త్తులు లేక శూన్యము లేక।యీసమస్తప్రపంచము తెలియబడక।వున్నఅవస్తయం
దుశుద్ధబోధమాత్రము ప్రకాశిస్తూ వుండెగనక శుద్ధమైన యెరుకే బ్రహ్మము
యీఅర్థమందుసందేహించక పునఃపునఃదృగ్దృశ్యవివేకము శాయగా దేహము
కంటె వేరై నిత్యమైనిరుపద్రవమైబ్రహ్మసుకస్వరూపముతానాయగనుకయితడే
ముక్తుడుయీలాగునఅన్ని వేదాంతములుబోధింస్తున్నవి।యిటువలెనేయాజ్ఞవల్క్యా
దిమహాత్ములు జనకాదులకు ఉపదేశము శాయగా యరుకమాత్రమే తనస్వరూ

పముగా నిర్ణయించి జీవన్ముక్తులై యుండిరి। యీలాగున పురాణములు ఉపనిషత్తులు బోధింస్తున్నవి। అదిగనుక యీప్రకారాన నీకు బోధిస్తిమి। నీవున్ను దృశ్యమిశ్రి శబ్దమిశ్ర నిర్వికల్ప సమాధుల నభ్యసించి బ్రహ్మమాత్రుడవై ఉత్పత్తి నాశములేక సంసారనివృత్తికలిగి ధన్యుడవు కావోయీ। అని ఉపదేశము శాయగా యీప్రకారాన మూడు సమాధులున్ను చేశి ధన్యుడాయెను। అటుగనుక యేపుణ్యాత్ములైనా యీగ్రంథము నిత్యమున్ను పఠన చేస్తూ యిందులో చెప్పినప్రకారముగా అభ్యాసము శాయగా జీవన్ముక్తుడై ధన్యుడౌను। యీఅర్థమందు ముముక్షువులకిన్ని నిస్సందేహము సత్యము. సత్యము. సత్యము.

## రామస్తవరాజము.

గీ॥ అనుచు ధర్మజుండు నాపరాశరసూను ♦ తోడబలుకనతడు తొలుత దేహ
తత్వమార్గమెల్ల తగ జెప్పకోరకున్నె ♦ వినుమటంచుబలికె వేడ్కతోడ॥

క॥ జీవేశ్వరతనువులు నా * ల్గావిధములరంగ నీకు * నఖిలము దెలసుక
భావింప బ్రహ్మబోధము * నీవైయుండంగవచ్చు * నిర్మలహృదయా॥

వ॥ మరియు జీవేశ్వర తనుచతుష్టయ లక్షణంబెట్లంటేని.

సీ॥ త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వా ఘ్రాణములు నైదు ♦ శబ్దాదులైదు వచనములైదు
పాదపాయుగుహ్య పాణివాక్కులు నైదు ♦ జ్ఞాతాదిబుద్ధుల జాడలైదు
భూజలాగ్నిపవనాకాశమహాభూత ♦ పంచీకృతకదంబ పంచవింశ
తి ప్రకారము స్థూలదేహమిందుకవస్థ ♦ జాగ్రంబు నేత్రము స్థానమరయ

గీ॥ యుక్తభోగంబు మరి క్రియాశక్తి రాజ ♦ సగుణమును విశ్వుడభిమాని తగనకార
మరయమాత్రుక యాత్మ జీవాత్ముడతడే ♦ వ్యావహారిక జీవుండు భూవరేణ్య॥

క॥ స్థూలంబీపదిసాంజ్ఞల * జాలయుతద్వ్యాసనావ * శతసూత్రాంగం
బీలాగనిమిదిపురముల * చేలలితంబ్రపియోక్తి * జలగగవినుమీ॥

౨౦. శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వకందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

గీ॥ జ్ఞానకర్మేంద్రియంబులు మానసాది । కర్మములునాల్గుతమమును కర్మకామ
ములునుభూతంబులును ప్రాణములును గూడి । యష్టపురములలింగాంగమగున్నృపాలా॥

సీ॥ కలలవస్థలయునికి కంఠమి చ్ఛాశక్తి ♦ తైజసుండభిమాని తనరసాత్వి
కంబుకారముమాత్ర కయును స్వేచ్ఛాభోగ ♦ మందులవ్యాపకంబైనయాత్మ
యంతరాత్మ నతండటప్రీతి భాశిక ♦ యాత్మడిబది సాజ్ఞలందులింగ
కెలమినిస్థూల సూక్ష్మాంగద్వయంబుల ♦ కారణంబగుటచే కారణాంగ

గీ॥ మగునునిదురందు సర్వేంద్రియంబులణగి ♦ యూపుర్గల్గు నభంబుండు నేర్పడంగ
నన్నవచనంబునౌట నీరజ్ఞగలదే ♦ యిందులకుపాత్రమైధాత్రియసగునయ్యా॥

గీ॥ పంచవింశతి తత్వంబులెంచనిట్టులౌను ♦ వటబీజగతి కారణాంగమింద
వస్థసుప్తియుహృదయంబు వాసముగును ♦ ప్రాజ్ఞుడభిమానియిందుకుదివ్యశక్తి॥

క॥ కననానందముభోగము * ఘనతామసగుణము * మాత్రుకమకారంబై
వినువ్యాపకాత్మపరమా * త్మయుతండెపారమార్థి * కాత్ముండధిపా॥

క॥ కారణమీపదిసాంజ్ఞల * మీరునవస్థాత్రియముల * మించినసాక్షి
కారణతనువృక్తనుమహ * కారణమగు దేహమింక * గలమనరేంద్రా॥

వ॥ ఇట్లవస్థాత్రయంబులకుసాక్షియై కారణంబునకు మహాకారణంబైన శరీరంబెట్లనా
పంచభూతోత్పత్తి హేతువులగు సద్యోజాత వామదేవాఘోర తత్పురుషా యీ
శానులను పంచబ్రహ్మ శరీరంబునకు పంచభూతంబులు నివృత్తి ప్రతిష్ఠా విద్యా
శాంతి శాంత్యాతీత పంచ కళలు। పంచ విషయంబులు। పరాశక్తి ఆదిశక్తి
జ్ఞానశక్తి యిచ్ఛాశక్తి క్రియాశక్తులను। నీ పంచ శక్తులు। ప్రేరేప స్వరూపం
బులైన పంచప్రాణంబులు పంచాక్షరియు పంచేంద్రియంబులు బ్రహ్మ విష్ణు రుద్ర
యీశ్వర సదా శివులను పంచకర్తలంతః కరణంబు లిట్లిరువైయైదు తత్వంబు
లంగూడి మహాకారణశరీరంబగు। నిందుకవస్థ తురీయం బభిమాని ప్రత్యగాత్మ
జ్ఞానశక్తి శుద్ధసత్వగుణంబు మూర్ధ్నిస్థానంబు నానందభోగంబు నోంకారమా
త్రృక। వీటియందుల వ్యాపకంబగునాత్మ నిర్మలాత్మ యతండె కూడిస్తచైతన్యం
డిందునోంకారంబుండుట నది మూలప్రకృతి। యీపది

సంజ్ఞలంగలది మహాకారణంబను దేహంబు । నలుబది సంజ్ఞల సంఖ్యలమీరి జ్ఞప్తి కళామాత్రంబుగ శేషించినదియే తుర్యాతీతం ॥ యిట్లు జీవతను చతుష్టయంబింక నీశ్వర తను చతుష్టయ లక్షణం బెట్లన్న । పృథివ్యాపస్తేజో వాయు రాకాశ చంద్రసూర్యాగ్నులను నష్టమూర్తు లీశ్వరుని యొక్క విరాడ్రూపంబగు స్థూల దేహం బిందుకుత్పత్తి యవస్థ అభిమాని బ్రహ్మ క్రియాశక్తి రాజసాహంకారం బు సూర్యస్థానంబు సర్వకర్తృత్వభోగంబు అకారమాత్రక । వీటితోడఁగూడి వ్యాపకంబగు నాత్మ భూతాత్మ యీ తొమ్మిది సంజ్ఞలంగలది వీరాట్పురుషుం డింక సకలభూతంబుల కాశ్రయంబగు హిరణ్యగర్భ శరీరం బెట్లన్న । దశదిక్కులు శ్రోత్రంబులు । వాయువు త్వగింద్రియంబు । సూర్యుండు నేత్రంబులు । వరు ణుండు జిహ్వేంద్రియంబు । నశ్వినీ దేవతులు ఘ్రాణేంద్రియంబు వహ్ని వాక్కు యింద్రుండు కరంబులు ఉపేంద్రుండు పాదంబులు బ్రహ్మ గుహ్యంబు మృత్యువు గుదంబు । జ్ఞాతృ వాంతఃకరణంబు మనంబు చంద్రుండు, బుద్ధి బ్రహ్మ । క్షేత్రజ్ఞుం డు చిత్తంబు అంహాకారంబు రుద్రుండు నీ చతుర్దశ దేవతులంగూడినది హిరణ్యగ ర్భశరీరంబు । యిందుకవస్థ స్థితి । విష్ణువు అభిమాని యిఛ్ఛాశక్తి । సాత్వికాహం రంబు । చంద్రుండు స్థానంబు । సర్వపాలకత్వభోగంబు । ఉకారంబు మాత్రక । వీటితో వ్యాపకమైన యాత్మ సూక్ష్మాత్మ । ఈ తొమ్మిది సంజ్ఞలంగలది హిరణ్య గర్భ శరీరంబగు నీవిరాడ్ఢిరణ్యగర్భాదులకు కారణంబైనది రెండవ స్వరూపం బైన యవ్యాకృతశరీరంబు । దీనికి ప్రళయావస్థ రుద్రుండభిమాని । ద్రవ్యశక్తి తామసహంకారంబును నగ్నిస్థానంబును సర్వసంహారభోగంబును మాత్రకమ కారంబు వీటితోఁగూడి వ్యాపకంబగు నాత్మ శుద్ధాత్మ । మఱియు నవ్యాకృతంబ న మహదహంకారంబనుట నదియె త్రిగుణగర్భంబును బిందూపాధిచే చిద్విలాసం బై పంచభుతంభూలకు కారణంబగు మరి విరాడ్ఢిరణ్యగర్భ అవ్యాకృతులను ఈశ్వ రమాయోపాధి శరీరంబులకు సాక్షిరూపంబగు నదియె మూలప్రకృతి । యది స్వారాట్టనంబడు । నదియ యనాహతనామంబును నదియె పంచబ్రహ్మంబును । నదియు పంచ భూతంబులకు హేతుభూతంబును యట్టి మూలప్రకృతి శరీరంబున

కసస్థ సర్వసాక్షి । ఈశ్వరుండభిమాని । శుద్ధ సాత్వికాహంకారంబు । జ్ఞానశక్తి బ్రహ్మానందాతిశయస్థానంబును సర్వకర్తృత్వ । సర్వపాలకత్వ । సర్వసంహారకత్వ । సర్వనియంతృత్వ । సర్వభోక్తృత్వ । సర్వేశ్వరత్వాది శడ్గుణైశ్వర్యంబె భోగంబు । ఓంకారంబుమాత్రిక । యిందులవ్యాపకంబగు । నాత్మ । మహాత్మ ఈశోమ్మిదిసంజ్ఞలంగలది । మూలప్రకృతి । శరీరంబగు నిపిండాండ బ్రహ్మాండంబులగు । యష్టశరీరంబులు వాచ్యార్థంబనిపించుకొనును వీటికి నతీతంబగు నదియా । ఈశ్వరరూపం బిదిదృశ్యంబు । వీటికి సాక్షిస్వరూపంబగు చిత్తు ఈ యెనిమిదింటితోఁగూడిన జ్ఞానోపాధిచాత శబలబ్రహ్మం బనిపించుకొనును । వీటికి నతీతంబగునది ఈశ్వరుని తుర్యాతీతం బది జలశర్కర న్యాయంబున నిత్య ముక్త శుద్ధ బుద్ధ సత్య ప్రజ్ఞాన ఘన సచ్చిదానంద నిత్యపరిపూర్ణంబగు నిది యన్నిశ్శబ్దబ్రహ్మం బదియ నీవని నశిపదంబుచెప్పును నదియే తత్వమస్యాది మహావాక్యలక్షణంబు తత్పద త్వంపద లక్ష్యార్థంబుల నసిపదం బఖండంబుగా బోధించు నట్లగుటం జెసి తత్వంపద వాచ్యార్థంబగు జీవేశ్వరాద్యష్టశరీరంబులు దృశ్యంబని యెఱింగి పరబ్రహ్మస్వరూపంబీవై సుఖంబుండుమని మరియు నిట్లనియే

గీ॥ అఖిలవ్యవహారుడితడె జీవాత్ముడంత ♦ రాత్మసంసారమునసంటియుంటకుండి యల్లజీవాత్మ పరమాత్మయంతరాత్మ ♦ వ్యావహారికసాక్షియౌనత డెభూపా ॥

క॥ నదియుంచువాడనడచిన * నదిపొంతలనున్నతరులు * నడచెమబ్బుల్ గదలినచంద్రుడుగదులును * కదలినజలమందునినుడు * గదులారీతిన్ ॥

క॥ దేహంబుచె తప్పుట్టువు * దేహికినిననునట్లునాత్మ * దివ్యంబైనన్ దేహావ్యవస్థగలిగెను * దేహి యునననుగాపురంబు * దెలియగనధిపా ॥

క॥ శ్రీరామునిమనుజత్వము * దూరంబునదోలగద్రోచి * దొరయగునీవే నారాయణుడనుకైవడి * నారయకూటస్థమాత్మ * యంద్వైక్యమగున్ ॥

క॥ నదిదాటిపదుగురేగుచో * తుదితనులెఖ్ఖంపమరచి * తొమ్మండ్రింకన్ పదుగురులేరననీవె * పదియౌవాడట్లజీవ * పదమైక్యంబుల్ ॥

మ॥ జననాథా విపరీతసంశయముల ♦ జ్ఞానంబువిఘ్నుత్రయం

బనగాముక్తికి వాటినిందోలగి ♦ బ్రహ్మానందవారాసింగో
మునుసుల్ దీరగనోలలాడు ♦ దుదియే మర్మంబు సత్యంబుగా
గను మీనానికిక జీవసంసృతులు ♦ సోకగ రావు యూహింపుమా ॥

క॥ వినవో యిధర్మనందన * తను దాగనుగొనుటకన్న * ధర్మము లేదై
నను వైరాగ్యంబు హరతి * యను వలెలేకున్న నాత్మ * యోగము గలదే ॥

క॥ యిన్నేలా జెప్పవలయును * తన్నే తా నెరుగుకొరకు * తనకన్యంబై
కన్నదియు త్రావిబ్బర * నిన్ను నినెరుగుసీవె * నికరంబధిపా ॥

క॥ యీరీతి నెరుగరుగాజూ * పారేసి పిండ డమాది * బ్రహ్మాడంబుల్
నీరుగజేసినవాడె * వైరాగ్యుడపును నెపుడు * నానున్నపాలా ॥

## స్థూలదేహలక్షణం.

స్థూలదేహము। నేత్రస్థానం। అకారమాత్రిక। తామ్రవర్ణం। సర్వ వ్యాపారం రుగ్వేదం। విస్వడభగాది। రజోగుణం। భూమితత్వం। దృశ్యరూపం। స్థూల భోగం। విపరీతజ్ఞానం। వైఖరీవాక్కు। సార్ధత్రయహస్త పరిమాణం। జాగ్రదావస్థ। నేత్రస్థానం। పంచభూతమయం। పంచవింశతి తత్వాత్మకం। ప్రత్యేకంభూమికళలు। ఉత్పత్తి। జాగ్రత। బోధ। వ్యాపృతి। యీ నాలుగుకళలూ ॥

| ఆకాశం | వాయువు | తెజస్సు | ఉదకం | పృథ్వి | |
|---|---|---|---|---|---|
| కామం | ప్రసరణం | నిద్ర | శ్లేష్మం | రోమాలు | ఆకాశం |
| క్రోధం | చాంచల్యం | సంగమం | శుక్లం | త్వక్కు | వాయువు |
| లోభం | అతిగమనం | క్షుధ | రక్తం | మాంసం | తెజస్సు |
| మోహం | భ్రమణం | తృష్ణ | మూత్రం | నాడి | ఉదకం |
| భయం | ఆకుంచనం | ఆలస్యం | మేదస్సు | అస్థులు | పృథ్వి |

## సూక్ష్మ దేహ లక్షణం.

సూక్ష్మ దేహము । అపంచీకృతం । కంఠ స్థానం । సత్వగుణం । ఉకారమాత్రక । స్వప్నావస్థ । అన్యథాజ్ఞానం । ఆపస్తత్వం । శుక్లవర్ణం । దృష్టరూపం । మధ్యవాక్కు । యజుర్వేదం । మనోవికారం । అంగుష్ఠమాత్రం । తైజసుడభిమాని । ప్రవివిక్తభోగం । ప్రత్యేకం జలకళలు । సాదృశం । అసాదృశం । యాదృశం । తాదృశం । యీనాల్గు జలకళలు .

| అకాశం | వాయువు | తేజస్సు | జలం | పృథ్వి | |
|---|---|---|---|---|---|
| అంతఃకరణ | వ్యానం | శ్రోత్రం | వాక్కు | శబ్దం | ఆకాశం |
| మనస్సు | సమానం | త్వక్కు | పాణి | స్పర్శ | వాయు |
| బుద్ధి | ఉదానం | చక్షుస్సు | పాద | రూపం | అగ్ని |
| చిత్తం | ప్రాణం | జిహ్వ | గుహ్యం | రసం | జలం |
| అహంకారం | అపానం | ఘ్రాణం | పాయువు | గంధం | పృథ్వి |

## కారణ దేహ లక్షణం.

కారణదేహం । హృదయస్థానం । తమోగుణం । ప్రాజ్ఞుడభిమాని । ఆనందభోగం । మకారమాత్రక । సుషుప్త్యవస్థ । అజ్ఞానస్థానం । తేజస్తత్వం । దృశ్యరూపం । కృష్ణవర్ణం । అంగుష్ఠార్ధప్రమాణం । పశ్యంతివాక్కు ।సామవేదం । తేజోమండలం । ప్రత్యేకఅగ్నికళలు । మరణం । విస్మృతి । మూర్ఛ । నిద్ర । యీనాల్గు అగ్నికళలు.

| ఆకాశం | వాయువు | తేజస్సు | జలం | పృథ్వి | |
|---|---|---|---|---|---|
| అవకాశం | భ్రాంతి | గూఢం | మృదుత్వం | మూర్తత్వం | ఆకాశం |
| విస్మృతి | శంకా | రూఢం | పోషణత్వం | శబలత్వం | వాయువు |
| ఆవరణం | శోషణం | కృతజ్ఞత | విశదత్వం | లజ్జ | అగ్ని |
| నిరావరణం | శిథిలీకరణం | అవిచారం | క్లేదనత్వం | పిండీకరణం | జలం |
| అప్రమాణ | స్థిరత్వం | సంశ్లేష | ధారణత్వం | కాఠిన్యత | పృథ్వి |

## మహాకారణదేహలక్షణం.

మహాకారణదేహము । సగుణం । ప్రత్యగాత్మ । మూర్ధ్నస్థానం । నైభోగికభోగము । తుర్యావస్థ । అర్ధమాత్రక । వివేకజ్ఞానం । ద్రష్టరూపం । వాయుస్తత్వం । నీలవర్ణం । మసురామాత్ర ప్రమాణం । అథర్వణవేదం । పరావాక్కు । వాయుమండలం । ప్రత్యేకవాయుకళలు । వైరాగ్యం । ముముక్షుత్వం । ఆత్మత్వంపదదర్శనం । తుర్యావస్థా.

| ఆకాశం | వాయువు | అగ్ని | జలం | పృథ్వి |
|---|---|---|---|---|
| పూర్ణత్వం | అఖండత్వం | అదాహ్యత్వం | అక్లేద్యత్వం | అశోష్యత్వం |
| అసంగత్వం | అభేద్యత్వం | ఊర్ధ్వపదత్వ | జగజ్జీవత్వం | కారణత్వం |
| వ్యాపకత్వం | పరాత్పరత్వం | ప్రకాశత్వం | పరంజ్యోతిత్వ | పావనత్వం |
| సర్వబీజకత్వం | నిర్మలత్వం | చైతన్యత్వం | అమృతత్వం | సమృద్ధత్వం |
| అఖండత్వం | అజరత్వం | అనర్ఘ్యత్వం | కారుణ్యత్వం | సర్వాధారత్వం |

## కైవల్య దేహలక్షణం.

కైవల్యదేహము । ఆకాశ వాయు రగ్ని జల పృథ్వీలీల పూవనలు అద్వితీయ మందు కనగల్గ చెప్పివారకు యిది అనుభవీకము.

| యోగి స్వనిర్విషయ వ్యాపారములైన అంతఃకరణలు | యోగి నిర్విషయ వ్యాపారములైన సమానాదులవలె | యోగి నిర్విషయ శ్రోత్రాదులవలె | యోగి సగుణారాహిత్యమైన శబ్దాదులవలె | యోగి నిర్విషయతాతీతం |
|---|---|---|---|---|
| నిరాకారం | ఆత్మారామత్వం | స్వయంజ్యోతిత్వం | పరాత్మతత్వం | భేదాభేదాతీతత్వం |
| పరాకాశం | అనావృత్తిచైతన్యత్వం | పరంజ్యోతిత్వం | సమరసత్వం | అభేదాభేదత్వం |
| చిదాకాశం | చిదీశ్వరభావముఖలీనత్వం | జ్యోతిర్మయత్వం | తత్వాత్మతత్వం | భేదాభేదత్వం |
| దహరాకాశం | సత్యజ్ఞానమనంతలక్షణపరత్వం | ఉపజ్యోతిత్వం | అమృతతత్వం | అఖండత్వం |
| అవ్యావృతాకాశం | అంతర్బాహ్యస్ఫూర్తిరహితత్వం | జగజ్జ్యోతిత్వం | బోధాత్మతత్వం | ద్వయత్వం |

* కందార్థము. *

(౫౭) * పరిపూర్ణమొకటిదక్క * నితరమైనప్రపంచమెల్ల * తగదెలియుమునీ * వెరుకేవని* మదిలోపల * యెరుకేపరిపూర్ణమెరిగి * దెరుకానెరిగేదీ * యింకోటిలె దీరెంచ్నెరగేదీ * యెరుకపుట్టువుమూల * మెరుగాదీమెరుకె * యెరుకెతాబుట్టిన దెరుగాబోయితెలేదం * యెరుకానెరిగేదీ * యింకోటిలే * దీరెంచ్నెరిగదీ ॥

## * కందార్థము. *

(గీ) * పాపములు పుణ్యములు భువి * బ్రాపించునుమెరుకచాత * భ్రమసినవారికి బ్రాపింపవెరుకనెడశిన * తాపసులనుచిత్తమందు * తగదెల్సుకొనుమీ * ఆగామీబో * ధనుతెన్సవినుమీ * పాపాలలోశుద్ధ * స్ఫటికాసన్నిభమైన * ఆపోజ్యోతిని ప్రత్య * గాత్మానిమద్దిలోన * తగదెల్సుకొనుమీ * ఆగామీబో * ధనుతెన్సవినుమీ

(క) దీపముగతికన్నులలో * పాపనలేక వెలుగుసిన్న * పరమాత్ముడవం
చిప్రజలబడలతురెరుగక * నీపాల్బడిగుండి నేను * నినునమ్ముదునే ||

## * శ్రీ శివరామదీక్షితీయ్యమనుబ్రహ్మద్యాశిష్ఠం *

## * అచలబోధశిద్ధాంతం *

శి — స్వప్నములో వచ్చినశరీరం। పుణ్యపాపం చ్చేశిందా లేదా అన్ని అన్ని వ్రాసుకునన వారు యవ్వరు। ముంద్దర వినుర్శచేశేవారు। యవ్వరు ||

గు — అదివేరే యిదివేరే కాదు। వకటేవ్యాపారం। పునికివొకటే తీరే। కొనకూయే మీలెదు। యీలాగు అన్ని శరీరాలకు సమానమే। పుట్టినవి మళ్లాపుట్టవు। కలకు మర్యాదాచేశేవారు యవ్వరూలేరు। కలయవ్వరిస్వాధీనం లేదు। అందుకే యీజగత్తుకు దిక్కులేదు। యవ్వరికి యాంగాంశఅనుకూలమైతె ఆలాగే। యెవ్వరెవ్వరి సమ్మతమేమతం। యేమర్యాదా నిలువదు। ఆధరువులేనిది। గనక ||

న్యాయంనమ్మరాదు। అన్యాయంనమ్మరాదు
ఆచారంనమ్మరాదు। అనాచారంనమ్మరాదు
ధర్మంనమ్మరాదు। అధర్మంనమ్మరాదు
కీర్తినమ్మరాదు। అపకీర్తినమ్మరాదు

యీశరీరానకు మొదలు యేమి వుండ్డివుండ్డిని। అని। యవ్వరువిచారించరు। తేనకు

తానేపుట్టి తనకుతానే కొనకుయేమీలేదు । యీలాగు నిశ్చయంవుంటే । వున్నవ్వాడు । వ్యవహారాలకు కర్తలేదు । కారణతలేదు । వున్నంత శేవు । మూలంలేని యీగుర్తెరిగేశరీరమేకర్త । మూలంలేనియీగుర్తెరిగేశరీరమేచేయిస్తుంది । సమస్తమైన వ్యవహారాలకు మూలం । మూలంలేని యీగుర్తెరిగేశరీరమేకాని । మరొకటిచెయ్యదు । చేయించ్చదు । మొదలుకొనాలేనిది । రాకడా పోకడా లేనిది । పుట్టని చావనిది । యన్నటికిశరీరంలేనిది । సకలదేశాలయందు । సార్వకాలాలయందు సమస్తమైన వాస్తువులయందు । చెలించ్చక । తనకుతానే స్వతశిద్ధమై । సార్వకాలం వొక్కతీరుగావున్నది । దాన్ని వుండచూచి । "మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమిలేదు" । అనిదృడంవుంచాలు । పుట్టని చావనిది గాక । శఖ్యంకానిది । వఘవింతవున్నది । ఆవింతకు మొదలుయేమీలేదు । విచారిస్తే యేమీలేదు । ఆవింత నేనుఅని తగిలింది । ఆవింతను వదిలించుకున్నవాడు । భ్రాంతి లేనివాడు । ఆవింత మూలంలేని యీగుర్తెరిగే శరీరమే కాని మరివొకటికాదు సర్వము మూలంలేని యీగుర్తెరిగే శరీరం తోటేవున్నది । మూలంలేని యీగుర్తెరిగే శరీరంతోటి సర్వంయేమీలేదు ॥

* గద్య *

యితి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే భ్రాంతిరహిత ప్రకరణం

## సానందోపాఖ్యానము.

* మునిబృందసానందసంవాదము. *

* పుణ్యాత్ముల గతి *

క॥ మునిచంద్రులారయేకథ.* వినిమెదరనుమోదమెసగ * వినిపింపుమమా
కనవ్వుడువారలలోపల * ననఘుండుధర్మప్రసంగు * డగుమునిబల్కెన్॥

గీ॥ పుణ్యమొనరించు వారలు పొందుగతులు । పాపమొనరించు వారలు బడెడు వెతలు
తెలియజెప్పెదవీకి తేటపడగ । వేడుకగు నేనిసీవును వినగదయ్య॥

క॥ అనవుడు సానందుండై * యనఘాత్ముని దిక్కు జూచి * హర్షోజ్జ్వలుడై
వినవలతు జెప్ప వేమున * మునిచంద్రుడు దెల్పదొణగె * మోదం బెసగన్ ॥

వ॥ విను మీమర్త్యలోకంబున పుణ్యపురుషులు దానధర్మ పరోపకారాది సుకృతంబులుం జేసి యాయుష్మంతులై సకలభోగంబుల పరితృప్తింబొంది ప్రాణావసాన కాలంబున పుత్రమిత్ర కళత్ర భ్రాతృవర్గంబులుం బరివేష్టించియుండ నందరితోడం బ్రతిభాషించి వనాయాసంబున కర్మశరీరంబులు విడిచి సుకుమార దివ్య సుందర శరీరంబులు దాల్చి శమన కింకరులు శాంతమూర్తులై తోడ్కొనిపోవ రాజీవహిత తనూభవ పురభేదనంబున కరుగు నమ్మహాదివ్యమార్గంబునా॥ * * * * * * *

సీ॥ మహాదివ్య శతదివ్య మయమందిరంబులు । భాసురస్ఫటిక సోపానతతులు
దీపిత చంద్రకాంతోపల వేదులు । మంజులస్ఫుట హేమ మంటపములు
గరుడశర వైడూర్య కుట్టిమస్థలములు । శుభలక్ష్మి ముత్యాల తోరణములు
పద్మరాగోజ్జ్వల పానీయశాలలు । తతచిత్రవస్త్ర వితానములును

గీ॥ శాతకుంభ స్ఫురత్కుంభ సంభ్రమములు । విమల రాజిత సౌధాంతరములుగలిగి
సకలశృంగార కలిత ప్రశస్తమగుచు । సరసమైయొప్పు పుణ్యాత్ములరుగు దెరవు॥

మ॥ జవనాశ్వంబులు భద్రనాగములు భాస్వచ్ఛ్యాదవ్రాతముల్
నవలావణ్య విలాసకామినులు నానాసూనగంధాన్వితో
త్సవగంధానిలముల్ ప్రఫుల్ల కుముదవ్రజస్ఫార కాసారముల్
సవిశేషాంచిత నిర్మలోదకములున్ సంపూర్ణమై చెల్వగన్ ॥

వ॥ మరియునుం జందన మందార మాకంద పనస వకుళ రసాల సాల నారికేళ ఖర్జూర జంబీర ప్రముఖ మహీరుహచ్ఛాయాది వితానభూతల సీమలంబులును కుంద కురంటక కరవీర పారిజాత కాంచన సుగంధ బంధుర పుష్పారామ ప్రదేశంబులును కాంచన కమల కల్హార కుముద పరిమళమిళిత కమలాకర

బులును। కలహంస మయూర శుక శారిక చంచరీక మనోహరనినద కోలాహ
లంబులును సద్యోఘృత దధి క్షీర మకరంద ఫలరసనదీప్రవాహంబులును సం
కుమద కుంకుమ కర్పూర పాటీర కస్తూరికాది సుగంధ ద్రవ్యంబులు పంకంబు
లుం జేసి పన్నీటజోకించిన కనక రజిత పాత్రంబులును। గంధర్వమానినీజన వితా
న మానంబును। పారిజాతప్రసూన వర్షంబులును। ధవళఛత్ర చామర కేత
న శిబికాసమూహంబులును కుసుమకిసలయ లలిత భవనంబులును। చిగురా
కు పానుపులును సిద్ధరసదీర్ఘికలును యెడనెడం జాగల్వ దోనెలునుం గలిగి శో
భిల్లు మార్గంబున నప్సరస పుణ్యుల కరుణా కలిత హృదయులై శమనకింక
రులు మణిగణఖచిత కాంచన సముంచిత కోటిసూర్యప్రతిభాశ దేదీప్యమాన వి
మానంబులపైని కూర్చుండి వేణు వీణా గాన స్వనంబులును। మంగళ తూర్య ఘో
షణంబులుం జెలంగ దండధరు రాజధానికిం గొనిపోవు సమయంబున॥ *

సీ॥ రత్నకంబళ్లును రంగుత్తి నీపట్టు । దిండ్లుచామంతిపూచెండ్లుగంధ
పొడలు ధూపములు పుష్పాదులు తళుకులు గల్గు । నిలువుటద్దంబులు నెమలికుంచ
సురటీలు కర్పూర చూర్ణ తాంబూలంబు । లగరుగంధము తావిభుగులు జాతి
పన్నీరు చెంబులు పట్టెమంచంబులు । పరుపులు దంతపుపావుకోళ్లు

గీ॥ తమ్మపడిగెలు తాళవృంతములొసంగి । చారుతరమైనభోగముల్ సారెసార
కింపుపళ్లు కొత్తమీరు భోగింపుడనుచు । పుణ్యపురుషుల నెచ్చరింపుదురు భటులు॥

మ॥ అకలంకస్ఫుట హాటకాంగదములు దత్స్వర్ణ రత్నాంగుళీ
యకముల్ వజ్రకిరీటముల్ పతకముల్ హారావళుల్ మేఖలా
నికరంబుల్ మణికంకణవ్రజము మాణిక్యస్ఫురత్కుండలా
ప్రకరంబుల్ తపనీయభూషణతతుల్ కల్మారునాదించుచున్॥

మ॥ ఇవె వస్త్రంబులు భూషణంబులివె మీకింపైన కస్తూరికా
ద్రవకర్పూర సమేతగంధమిదె నెత్తావుల్ బిసాళించుచున్
పవిత్రాన్నంబిదె బొన్నుదిండులివె నానాపక్వపానీయభో
జ్యవిశేషంబులివే ఫలంబులివె యందందందనందియ్యగన్॥

చ॥ గారెలు బూరెలిడ్డెనలు గమ్మనిదోశలు జక్కిలంబులున్
జాతులు కూరలుం ఫలరసంబులు దేనెలు పానకంబులున్
సారెలు పాయసాన్నములు చక్కెర లుక్కెర లప్పడంబులున్
జేరిన నేతులుం జెరుకుబిల్లలు చల్లనినీరు మజ్జిగల్ ॥

సీ॥ కలవంటకంబులు ఖజ్జాయములు మనో ౹ హారములు దియ్యని యానబాలు
మీగడ మంచిమామిడిపండ్లు నరటులు ౹ ఖండశర్కరలు టెంకాయబాలు
పనసపండులు ద్రాక్షపండులు ఖర్జూర ౹ ఫలములు గజనిమ్మ పండ్లు దోస
పండ్లు కమ్మనిసారపప్పును గసగసల్ ౹ శీతలోదకములు చెరుకురసము

గీ॥ భక్ష్యభోజ్యలేహ్య పానియ్యములునిట్లు ౹ తృప్తిబొంద జేసి దివ్యవిభవ
మలరగొంచబోయి యర్కజపురబహి ౹ ర్ద్వారదేశమందు వారిడించి॥

గీ॥ వారలందరు మనపురద్వారసీమ ౹ నున్నవారనిదెలుప ప్రసన్నుడగుచు
గరుడగంధర్వకిన్నరగణముగొల్వ ౹ వారికెదురేగి కాంచెవైవస్వతుండు॥

క॥ వినయములనిటులదర్మ్యల * గనికుతుకస్వాంతుడగుచు * గ్రన్ననతసదా
పునగొల్చుచిత్రగుప్తుం * డనుకరణముదిక్కుజూచి * యంతికుడనియెన్ ॥

మ॥ కరుణాదృష్టిని వీరిధర్మములు వక్కాణించు వాజ్మాధురీ
సురుచిత్వంబున మేదినీతలముపై నేమేమిధర్మంబు జే
సిరిమార్కున్ వివరింపుమన్నజముతో జెప్పందొణంగెన్ మహా
గిరిరాడ్జాట ధునీతరంగములమాడ్కిన్ జిత్రగుప్తుండొగిన్ ॥

శా॥ కన్యాదానముశేయువారు హితసంకల్పంబులీడేర్చువా
రన్యాయంబులులేనివారు గురుపూజారంభకుల్ దేవతా
మాన్యుల్ దుర్జనసంగవర్జితులు కామక్రోధదూరుల్ మహా
ధన్యాత్ముల్ సవిశేషవర్తనులు తీర్థక్షేత్రసేవారతుల్ ॥

సీ॥ అపకారమొనరించు నధమునకైనను ౹ నుపకృతిజేయు నీయుత్తముండు
గ్రీష్మకాలంబున గిరిజేసునకువసు ౹ ధారగల్పించెనాధన్యమూర్తి
వైశాఖవేళ్లల వసుధామరులకిచ్చె ౹ తాళవృంతంబు లీధర్మశాలి

కరువుకాలంబున మనుజుల కొచ్చినవారి ॥ కూడుకొసంగి కాపాడెనతడు

గీ ॥ చెడినబంధుజనంబు రక్షించె చేసితడు ॥ దీనమానవులాపద దీర్చెనతడు

తారతమ్యంబులెరిగిన దాతయితడు ॥ గురుపడ తండుసంగరక్షణి యందు ॥

క ॥ గోదానమిచ్చెనితడు * భూదానమొనర్చెనతడు * బుధకోటికిశా

టీదానమొసగెనితడు * వేదంబా బుధునకు శిష్య * వితతికి జెప్పె ॥

ఉ ॥ శ్రీగిరి క్షేత్రవాసికి । విశేషధనంబులొసంగెనితడ

భ్యాగత పూజజేసినమహా । త్ముడితండు పరోపకారియై

రోగులకౌషధంబులిడి । రోక్షమునుట్టకమాన్పినతడా

జాగిలి మ్రొక్కు సంతతము । శైవులగన్గొనినప్పుడాతడున్ ॥

క ॥ జననీజనకులువృద్ధులు * దనయులు బాంధవులు హితులు * దనియకమునుపా

ఘనుడుభుజింపగనొల్లం * డినదనందన పంక్తి భేద * మెరుగడితండున్ ॥

క ॥ లోకాపవాదమునకత * డాకంపమునొందు * పరులయందుగుణంబుల్

జేకొనిసంతోషించును * ప్రాకటగురుభక్తి గలుగు * భవ్యుడితడె ॥

సీ ॥ నవరసాలంకార నానా ప్రబంధముల్ ॥ శివుకల్పితముగాగ జెప్పెనితడు

చెరువులుగుంటలు పరువుభావులు కూప ॥ ములుచాలద్రివ్వించుముఖ్యుడితడు

తోపులుపువ్వుల తోటలుపేటలు ॥ భువివృద్ధిబొందించుపుణ్యుడితడు

నడవడిగల వేళ్ల వడుగులు వొడ్లిండ్లు ॥ మించిన వేడ్క చేయించెనితడు

గీ ॥ చీమ పేనునల్లి దోమలు మొదలైన ॥ జీవములకుహింస శేయడితడు

పరులసంపదలకుపరమాద్భుతానంద ॥ కలితబుధినున్న ఘనుడతండు ॥

క ॥ తల్లియెడతండ్రియెడగురు * నల్లభునెడదప్పగలుగ * వారలనెన్నం

డుల్లమునన్ వ్వబలుకని * బల్లిదుడీఘనుడుపద్మ * బాంధవపుత్రా ॥

వ ॥ వెండియు ప్రచండ తీవ్రాతపకాలంబున సర్వంసహా సుపర్వులకు శైత్యోప

చారంబుగా దధ్యోదన గుడజల కుసుమగంధ పుష్ప తాంబూల ఛత్రి చామ

ర పాదరక్షా ప్రదానంబులొసంగిన సుజ్ఞాననిరతులును । నిరతాన్నదాన కనక

రత్నాభరణ స్థాలగ్రామ శివలింగదాన నిదానపరులును । పరోపకార సుకృత

## పా పా త్ము ల గ తి

సీ॥ వినవయ్యసానంద విశ్వంభరాస్థలి ∗ జనులుపాపంబులు చాలజేసి
కడపటబాళిశాంత కాలంబుదాపైన ∗ శ్లేష్మరోగములచేశీర్ణులగుచు
దేహంబుతెరుగక దీనభావంబున ∗ కడుదద్దరిల్లంగ కాలభటులు
కాలనీరదభయంకర విగ్రహోదగ్రి ∗ నిగ్రిహాగ్రిహాబలోన్నిద్రులగుచు
గీ॥ మోరిలనిల్చి పాశముల ప్రాణములుదీసి ∗ యాతనాశరీరమందుజేర్చి
గొలుసులరుతబెట్టి కుక్కలగొనిపోవు ∗ పోశైఖలులగొంచుబోవునపుడు॥

చ॥ యమపురికేగుమార్గము భయంకరమైకనుపట్టుదట్టసా
ఘములకుదుష్కరాటవులు కంటకభూములుకత్తిరాళ్లు వే
డిమివడిగాయునెండలు కడిందిమృగంబులుఢాకినీపిశా
చములు శిలోగ్రవర్షము లసహ్యములైనకఠోర వాయువుల్॥

చ॥ గొటగొటరొబ్బుబెబ్బులులఘోషము భీకరసూకరార్భటుల్
పెటపెటబండ్లుగీటుకొను భీమనిశాట పిశాచనాదముల్
దొటదొటరాలుచున్నవశి తోరపునిప్పులవానలొక్కడిక్
చిటచిటమండుమంటలు గసిక్కననా ఒడిముండ్లతోవలున్॥

క॥ పల్లేరుముండ్లగుల్లలు * చెల్లాచెదరైనకొండ * చీమలబారుల్
పెల్లునగూసెడినక్కలు * పెల్లార్చియదల్చుభూత * బేతాళంబుల్॥

క॥ పిడుగులునలుగడపెళపెళ * బెడిదముగానిగుడిపెట * పెఠిల్లుమనంగా
కడువడిబడినొడలుడికెడు * పుడమినిచెడువక్రగతులు * పురవురతెరవుల్॥

గీ॥ రొంపిగలసినకొత్తసున్నంపుటేన్లు | పెద్దచీకట్లుగ్రమ్మెడిపేవపొదలు
గండుతుమ్మెదపిండులు కణదిరీగ | తిట్టతీగలగుంపులాతెరవులోన॥

గీ॥ కండ్లుదెరువంగనియ్యనిగాలిదుమ్ము | లుప్పరంబందికనుపట్టునుప్పరాసు
లుడుకులెత్తెడియడుసులకడునసహ్య | మైనజలదారియడుగులందందకలవు॥

వ॥ అట్టిదుష్టమార్గంబున దుష్టమానవుల యమభటపగ్గంబు పట్టుకొని నెట్టుచు

సీ॥ నిబిడమైకురిసెడి నిప్పులవానలో ౯ మలమలకొందరిమాడజేసి
దరికొనికాలెడి దవవహ్నికీలల ౯ పొరిపొరికొందర పొక్కజేసి
చురుకుచురుకున సున్నంపుమడుగుల ౯ సురసురకొందరి సృక్కజేసి
ప్రళయకాలాగ్నిల భానురశ్ములకాక ౯ కందందకొందరి క్రాగజేసి
గీ॥ నిలువనీడలేక నీళ్ళకువాపోవ ౯ దగులుయెండజేసి తెగువజేసి
ప్రాణికోట్లనిట్లు బాములుబెట్టుచు ౯ మఱియుకాలభటులు మత్సరించి ॥

వ॥ యిప్పగిది నప్పాపాత్ముల ననేకవస్థలంబెట్టుచు గొనిపోవునప్పుడు నచ్చనటులు దమలోన.

సీ॥ చింతింపమైతిమి శ్రీమహాదేవుని ౯ తలపలేమైతిమి ధర్మగుణము
కోరలేమైతిమి గురుకరుణారస ౯ మెన్నమైతిమి జగదీశుమహిమ
చదువలేమైతిమి శైవాగమంబులు ౯ పూజింపమైతిమి బుధులనెరిగి
చేరలేమైతిమి గురుభక్తజనముల ౯ బాయమైతిమి మోహపాశతతుల
గీ॥ సేయమైతిమిదానంబు చేతులారా ౯ నడువమైతిమి ముక్కంటి నగరమునకు
జరుగమైతిమితీర్థరాజములుజూడ ౯ మురుగమైతిమిఆయ్యయో ముఖ్యనదుల॥

మ॥ శరసంపత్తికి నోర్వలేక పరులం ♦ బాధించియెల్లప్పుడున్
పరనారీ గమనంబు జేసితిమి ♦ చెప్పంగూడదిట్లాటమా
దరయన్ లేక జరింపజొచ్చితిమి ♦ పుణ్యాధీరులం జేరకం
కరతత్వంబు భరింపమైతిమకటా ♦ కామానుకూలస్థితిన్ ॥

వ॥ ఇట్లనేకభంగులం జింతించుచున్న పాపజాతు సంతానంబులం గని మహాఘోర క్రోధావేశంబులును కుంచితారుణ కేశపాశులును స్థూలమేచకాంగులును సందష్ట దంష్ట్రాకరాళ వికటానన వదనగహ్వరులును ప్రళయకాల కాలనీరద సంకాశ నిజకాయులును చండప్రచండోద్దండ దోర్దండమండిత కాండ కోదండ దండ గదాదండ భిండివాలప్రముఖ నిఖిలాయుధ నికాయులును దుర్నిరీక్ష తామ్రాక్షులగు కాలకింకరులు రూక్షేక్షణంబు నిరీక్షించి రోషంబులుమొగంబుల రూపింప నప్పాపకర్ములకిట్లనిరి.

క॥ మదమత్సరంబువదలక * మదవతులంగోరితిరిగి * మదనాతురులై
మదినెరిగి సేయుదురితము * కొదువక మిమ్ముంకకట్టి * కుడువక పోనే॥

క॥ దారతనూభవరక్షణ * కారణమున ఘోరమైన * కలుషము సేయం
గోరితిరి వారలిపుడె * వ్వారైననుమిమ్ముగోరి వచ్చిర చెపుడా॥

క॥ మీరెంతగాసిపొందిన * మారాజుపదంబులాన * మామకచిత్తాం
భోరుహమున నెంతైనను * కారుణ్యము బుట్టదేమి * గంటిరిమీరల్॥

గీ॥ సమలికన్నిరు వేటకానికి ప్రియంబు ॥ గాముగావున మీరెంతగాసిపడిన
మాకుదయరాదు మావద్దనుందురైన ॥ కరుణగానము వోదుష్టకష్టులారా॥

గీ॥ మనుజలోకమునకు వనజాప్తనందను ॥ వినుయమ బదేను వేలయోజ
నములదవ్వుమీరు నడచుచున్న టేకింక ॥ ననుచ క్రోధ ఘూర్ణితాక్షులగుచు॥

క॥ ఫీలెండనిపెనుకుడియుల * పాలుంగావి తురొకని * పరిఘంబులచే
తోలూడదీతు రొకని * కోలంసుదురు బాలు * గోలన్నియొకని॥

వ॥ యిత్తెరంగునం గాలభృత్యులు మత్తచిత్తులు దోడ్తెచ్చిపోయి వెలిహజార బు
దాపున వారలండించి సమవర్తికడకుంజన్ని సాష్టాంగదండ ప్రణామంబు
గావించి చేతులు మోడ్చి యిట్లనిరి.

సీ॥ నవధారు దేవమీ యాజ్ఞ మన్నిడుకొని ॥ యేము భూతలమున కేగి దెంచి
పాపకర్ములబట్టి బహుపాశములగట్టి ॥ తూలించి నొప్పించి తృళ్ళించి
తెచ్చితిమందరు దేవరిమొగసాల ॥ వచ్చియున్నారని వారుదెలుప
తీవ్రకోపంబున దెండిచ్చుటకు వారి ॥ ననవ్రుడు కింకరులగిఖులల
సరగదోడితెచ్చి సమ్ముఖంబున నిల్ప ॥ మురుకు చూపు లెసగ జూచియప్పు
డాప్పుడైన చిత్రగుప్తుని గనుగొని ॥ యిట్లులనియె ధర్మేశ్వరుండు॥

ఉ॥ ఓమహితాత్మజూచితి కుయోగుల ॥ యెన్నడొనమన్న దెన్
నేమహిలోన వీరలు చుదించి ॥ యొనర్చిన ఘోరదుష్కృత
స్తోమము లెన్ని జెప్పుమన ॥ సూర్యతనూభవుం కజూచియో
స్వామికి రాకు దెల్పెద ॥ విచక్షణవైఖరి చిత్తగింపుమా॥

క॥ అనిపలికి చిత్రగుప్తుం * డనుపమగతికవిలెప్పట్టి * డాకులు కేలం
గొని శెంభుశాటగంగా * ఘనభంగస్ఫూర్తి దనర * గానిట్లనియెన్ ॥

శా॥ పరధనసక్తులున్ నిఖిల § బాంధవవిరోధులు మిత్రవంచకుల్
హరిహరభేదమానసుల § హంకరణాఢ్యులు జీవహింసకుల్
గురుపితృభక్తికంటకులు § క్రోధవిచారులు ధర్మసత్క్రియా
విరహితులిట్టి దుష్కృతుల § వీడనివీడిని యేర్పరించెదన్ ॥

క॥ బుధమతియై కాంతామణి * పతిగోరి గృహంబులోన * బరితాపింపన్
మతిగలవక వేరొక్కని * సతి క్రీడించె వీడు * చపలాత్మకుడై ॥

సీ॥ గురువిల్లాలితో గూడె వీడు చచ్చెంతు § తండ్రిబొందిన బోటిదగిలెవాడు
అన్నయటన్న తొయ్యాలి నేలెనీకర్మి § పినతల్లి నైనయు పాపిష్ఠివాడు
తమ్ముని భార్యను ద్రతి బట్టె వీడుష్టు § దత్తతో సయ్యాట మాడెవాడు
తల్లి చెల్లెలు బొందదలచె నికష్టుండు § కలశినాడగ్రజాంగనను వాడు
గీ॥ బలిమి రతికేళి సలిపె కోడలితో వీడు § విధవలకు గర్భభరముగావించె వాడు
విప్రభామల గోరిన వెధగ వీడు § బోనగత్తెల భోగింపబూనె వాడు ।

క॥ ఎక్కడ మరణము షోడశ * మెక్కడ తిలదానభూమి * యెక్కడ శ్రాద్ధం
బెక్కడ యవికులకర్మం * బక్కడ పోనాడి తిరుగు * నధముండితడే ॥

క॥ గురువుల సందర్శింపక * గురుశిష్యక్రియల నెల్ల * కోపాత్ముడై
గురుభక్తి సలుప నేరక * గురునిందల కుత్సహించు * కుటిలుడు వీడే ॥

ఉ॥ ధాతువిలక్షణంబుల నిదానము లేక ♦ మహౌషధక్రియా
ఖ్యాతిగ రోగజన్యముగునా ♦ గుణసంగతి కాలకోపమూ
దూతవిశేషభావములు ♦ దోచక నూరక మందులిచ్చిని
ఘాతకుడై యతండు ♦ బోడిగట్టెను వీడు ధనాభిలాషియై ॥

వ॥ అని యిత్తెరంగున బ్రహ్మహత్య సురాపాన గురుతల్పగమన స్వర్ణస్తేయ
తత్సంగతాది మహాపాపసహితులును స్త్రీ పశు శిశు జీవహత్యాద్యుపపాతక
విహితులును హరిహర పరాఙ్ముఖులును అఖిల ప్రాణిహింసాపరాయణులును

బౌద్ధ చార్వాకాది దుర్మతస్థులును పరాంగనాలింగనానిర్నిద్రులును గురుసేవా
వంచకులును గురుపరిత్యాగులును విద్యాచోరకులును విశ్వాసఘాతకులును
స్వైరంజూపి తత్కర్మంబులు చిత్రగుప్తుండు విచిత్రవైఖరి వినిపించిన నాలకించి
సమవర్తి కోపంబు మొగంబునం జిగురింప నప్పాపజాతులం జూచి తలయూచి
నిరంకుశ త్రిలోకభయంకర ప్రచారులగు తన పరిచారకుల గనుంగొని యిట్లు
ను నచ్చటి సనాతన మహర్షి పుంగవులయనుజ్ఞను విజ్ఞానేశ్వర సత్కారంబున
నీయజ్ఞానులకుం దగినయాజ్ఞ వినిపించెద వినుండని యొక్కుండిట్లనియె.

సీ॥ గృహదాహకులబట్టి కీలిజాతోజ్జ్వల । జ్వాలలగాల్పుండు సాహసమున
గురుతల్పగమనుల ఘోరాసిపత్ర । వనంబులనీడ్చుడంగబులురుల
విద్యాన్నకన్యకావి క్రయాసక్తుల । నడలద్రిప్పుడు దారుయంత్రములను
మద్యమాంసాహార మత్తచిత్తులదుఃఖ । పడద్రోయుడంధ కూపములలోన
గీ॥ నీతిమాలినపాపులాధి నేతిసమితి । మంగలంబుల వేచుడీ మాడిపోవ
కండలసిధార చెండుడీ కొండెకాండ్ల । కోయుడ్రులకోడవంట క్రూరమతుల ॥

చ॥ తగనికురంగనేత్రల ♦ ముదంబున బొందినమందబుద్ధులన్
భుగభుగమండిట్టినుప ♦ బొమ్మలనిమ్ములనంటగట్టుడీ
బగగొన్ని భ్రాతృపితృగురు ♦ బాధులదూరినవారిపై మహా
యుగములదాక పర్వతను ♦ లొయ్యనవైవుడు దోర్బలోద్ధతిన్ ॥

వ॥ మరియు ననేక విధంబులగు దురితంబులాచరించిన పురుషాధముల దొడ్డ
కొంచెంబులరసి మద్వాక్యోల్లంఘనంబు గాకుండ మీమీ నేర్పులుమెరయ
హరివారికిందగిన నరకంబులు రౌరవంబును కుంభీపాకంబును కాల సూత్రం
బును నసిపత్రంబును అనలలోహస్తంభంబును మొదలుగాగల దుర్గతుల
నిందర బాధించునెడ నిమిషార్ధంబైన కాలుద్రియ్య దెరవ సావకాశంబు
లేకుండునట్లుసకావస్థలం బెట్టుండని భటకోటికి నప్పనుల నొప్పించిన మహా
ఘోరనరకంబులం బడరాని యిడుములం బడి జీవులు బహు దుఃఖంబు లనుభ
వింతురని చెప్పినవిని సానందమాని యాధర్మప్రసంగునకిట్లనియె.

క॥ అనిపలికి చిత్రగుప్తుం * డనుపమగతికవిలెప్పట్టి * డాకులు కేలం
గొని శంభుజూటగంగా * ఘనభంగస్ఫూర్తి దనర * గానిట్లనియెన్ ॥

శా॥ పరధనసక్తులెన్నిఖిల ✠ బాధువిరోధులు మిత్రవంచకుల్
హరిహరభేదమానసుల ✠ హంకరణాఢ్యులు జీవహింసకుల్
గురుపితృభక్తికంటకులు ✠ క్రోధవిచారులు ధర్మసత్కళా
విరహితులిట్టిదుష్కృతుల ✠ వీడనివీడనియెగ్గు రెంచెదన్ ॥

క॥ బుధమతియై కాంతామణి * పతిగోరిగృహంబులోన * బడాపింపన్
మతిగలవక వేరొక్కని * సతితోక్రీడించెవీడు * చపలాత్మకుడై ॥

సీ॥ గురునిఇల్లాలితో గూడె నీతుచ్ఛుండు ✠ తండ్రిబాందిన బోటిదగిలెవాడు
అన్నయటన్న తొయ్యాలి నేలెనీకర్మి ✠ పినతల్లి నైనయు పాపివీడు
తమ్ముని భార్యనుద్ధతి బట్టెనీదుష్టు ✠ డత్తతో సయ్యాట మాడెవాడు
తల్లి చెల్లెలు బోడదలచె నీకష్టుండు ✠ కలశినాడగ్రజాంగననువాడు

గీ॥ బలిమిరతికేళిసలిపె వీడలీలవీడు ✠ విధవలకు గర్భభరముగావించెవాడు
విప్రభామల గోరిన వెతకువీడు ✠ బోనగత్తెల భోగించె బూనెవాడు ॥

క॥ ఎక్కడ మరణము షోడశ * మెక్కడ తిలదానభూమి * యెక్కడ శ్రాద్ధం
బెక్కడ యవిరులకర్మం * బక్కడ పోనాడితిరుగు * నధముండితడే ॥

క॥ గురువుల సందర్శనపర * గురుశిష్యాశ్రయుల కెల్ల * కోపావ్రతుడై
గురుభక్తి సలుపనేరక * గురునిందల కుత్సహించు * కుటిలుడువీడే ॥

ఉ॥ ధాతువిలక్షణంబుల నిదానము లేక ✦ మహాపధక్రియా
ఖ్యాతిగరోగజన్యముగునా ✦ గుణసంగతి కాలదోషమా
దూతవిశేషభావములు ✦ దోచకనూరక మందులిచ్చిని
ఘాతకుడై యుసుంబు ✦ లొడిగట్టెను వీడు ధనాభిలాషియై ॥

వ॥ అని యిత్తెరంగున బ్రహ్మహత్య సురాపాన గురుతల్పగమన స్వర్ణస్తేయ
తత్సంగతాది మహాపాపసహితులును స్త్రీపశు శిశు జీవహత్యాద్యుపపాతక
విహితులును హరిహర పరాఙ్ముఖులును అఖిల ప్రాణిహింసాపరాయణులును

బౌద్ధ చార్వాకాది దుర్మతస్థులును పరాంగనాలింగనానిర్నిద్రులును గురుసేవా
వంచకులును గురుపరిత్యాగులును విద్యాచోరకులును విశ్వాసఘాతకులును
వ్వేరేరంజూపి తత్కర్మంబులు చిత్రగుప్తుండు విచిత్రవైఖరి వినిపించిన నాలకించి
సమవర్తి కోపంబు మొగంబునంజిగురింప నప్పాపజాతులంజూచి తలయూచి
నిరంకుశ త్రిలోకభయంకర ప్రచారులగు తన పరిచారకుల గనుంగొని యిట్ల
ను నచ్చటి సనాతన మహర్షి పుంగవులయనుజ్ఞను విజ్ఞానేశ్వరస్వీకారంబున
నీయజ్ఞానులకుందగినయాజ్ఞ వినిపించెద వినుండని యముండిట్లనియె.

సీ॥ గృహదాహకులబట్టి కీలిజ్వాలాజ్వాల ♦ జ్వాలలగాల్పుండు సాహసమున
గురుతల్పగమనుల ఘోరాసిపత్ర ♦ వనంబులనీడ్చుడంగబులురుల
విద్యాన్నకన్యకావి క్రయాసక్తుల ♦ నడలదివ్వహించుదారు యంత్రములను
మద్యమాంసాహార మత్తచిత్తులదుఃఖ ♦ పడద్రోయుడంధ కూపములలోన

గీ॥ నీతిమాలినవిప్రులాధినేతసమితి ♦ మంగలంబుల వేచుడీ మాడిపోవ
కండలసిధార చెండుడీ కొండెకాండ్ర ♦ కోయుడుగ్రులకొడవంట క్రూరమతుల ॥

చ॥ తగనికురంగనేత్రల ♦ ముదంబునబొందినమందబుద్ధులన్
భుగభుగమండిట్టినుప ♦ బొమ్మలనిమ్ములనంటగట్టుడీ
బగగొని భ్రాతృపితృగురు ♦ బాధులదూరినవారిపైమహా
యుగములదాకపర్వతను ♦ లొయ్యనవైవుడు దోర్బలోద్ధతిన్ ॥

వ॥ మరియు ననేక విధంబులగు దురితంబులాచరించిన పురుషాధముల దొడ్డ
కొంచెంబులరసి మద్వాక్యోల్లంఘనంబు గాకుండ మీమీ నేర్పులుమెరయ
హరివారికిందగిన నరకంబులు రౌరవంబును కుంభీపాకంబును కాల సూత్రం
బును నసిపత్రంబును అనలలోహస్తంభంబును మొదలుగాగల దుర్గతుల
నిందర బాధించునెడ నిమిషార్థంబైన కాలుదియ్య దెరవ నావకాశంబు
లేకుండునట్లనేకావస్థలం బెట్టుండని భటకోటికి నప్పనుల నొప్పించిన మహా
ఘోరనరకంబులం బడరాని యిడుములంబడి జీవులు బహు దుఃఖంబు లనుభ
వింతురని చెప్పినవిని సానందమహాని యాధర్మప్రసంగునకిట్లనియె.

# శేష ధర్మములు

వ॥ దేవా అవధరింపుము నిష్ఠురతపోనిష్ఠాగరిష్ఠులగు శౌనకాది మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణేతిహాస కథాకథన కౌతూహల సమేతుండగు సూతుండి ట్లనియెనట్లు వైశంపాయనుండు జనమేజయు నాలోకించి.

క॥ ఘనుడాయమతనయుండ * ట్లనుపమధర్మములువినుచు * నాశ్చర్యమతిన్ వనజోదరుపాదములకు * నెనయన్నతి జేసిమరియు * నిట్లనియె గన్ ॥

* అఖిలదానప్రశంస. *

క॥ నానావిధవస్త్రంబులు * నానాద్రవ్యములు గలలిత * నానాసుమముల్ నానాగంధములెవ్వరి * కీనగుతత్పాత్రుడెవ్వ * డెరిగింపుకృష్ణా ॥

వ॥ అనిన యమతనయునకు వసుదేవతనయుండిట్లనియె.

గీ॥ సర్వదానంబులకు నేనె స్వామినగుట ♦ జేసినాకుప్రీతంబుగ జేయవలయు దానమటుగాన మన్మూర్తిధారులైన ♦ విప్రులకు జేయుదానముర్వీశ లేశా ॥

* వస్త్రదానము. *

క॥ మనుజేంద్రవిప్రునికిని * తనవస్త్రముసంగినట్టి * ధన్యుడుఘనుడై తనవంశసంభవులతో * ననయమ్ముశివలోకసుఖము * నధివసియించున్ ॥

* ఛత్రయాన పాదుకాదులు. *

క॥ గొడుగునుయానముపాదుక * లడుగులమరుగలును సమిధ * కాంచితభక్తిన్ పుడమిసురగంటికిచ్చిన * వాడయుడు స్వర్లోకసుఖము * నొందునృపాలా ॥

* కృష్ణాజిన వృషభదానము. *

గీ॥ అనఘకృష్ణాజినమ్ము విప్రునకునిడిన ♦ ఆయుమవర్గలనుగు వ్యాధులణగిపోవ వృషభదానంబు జేసినవినయమతికి ♦ కలుషములుబాయు స్వర్గసౌఖ్యములుగల్గు

* వారిపూరిత పాత్రదానము. *

సీ॥ వారిపూరితమైన దారుపాత్రమొసంగ ♦ నజుడిచ్చుగరుణ నన్నయపదంబు నంబువుల్నించి లోహపుపాత్రమిచ్చిన ♦ నమరేంద్రుడమరలోకమునసంచు

జలముతో తామ్రభాజనము దానముసేయ । భానుండు తనసమీపమున నిలుపు
నిండారునీటితో వెండిగిండి యొసంగ । నిందుడాత్మస్థాన మిచ్చిమనుపు
గీ॥ కనకమయమైన కుండవిప్రునకుస్వాదు । సలిలములతోడ నర్పించ సకలదేవ
యక్షగంధర్వ సేవితంబగుమదియ్యు । భవనమున నెనయుంతు పార్థివవరేణ్య

* కాంస్య పాత్రదానము. *

గీ॥ కాంస్యపాత్రంబు వస్త్రయుగ్మమునజుట్టి । విష్ణుసంప్రీతిగా నొక విప్రవరుని
కెవ్వడిచ్చునతండు మహీతలేశ । అఖిలలోకప్రపూజితుండై చెలంగు ॥

* సర్వవస్తుదానము *

గీ॥ యమతనూభవ సర్వకాలము యందు । భూమిసురునకు నాము దుబుద్ధివిల్చి
మొద్దియేని యొకించక యిచ్చెనేని । అదిసమస్తము మేరువంతై తనరు ॥

* వస్త్రౌషధాలు దానము. *

గీ॥ వృద్ధుడై పేదపడియున్న విప్రమణికి । వస్త్రదానంబు జేసిన వాడు రోగి
కొనర నౌషధమిచ్చి బ్రోచిన నరుండు । కాంతురు దివ్యలోక సౌఖ్యములనధిప

* సువర్ణ రజత దానము *

గీ॥ పైడి వెండియు నిరుపేద బ్రాహ్మణునకు । దానమొసంగిన ట్టియా ధన్యు భాగ్య
మేమి జెప్పుదు సురగరుడేంద్ర సేవ్య । మైసమల్లోక సౌఖ్యంబుల ననుభవించు ॥

* కమండలు కాషాయవస్త్ర దానము. *

క॥ విను భూపక మండలువుర్ * ఘనతర కాషాయపటము * కౌపీనంబుల్
దనరగ సన్న్యాసికిని * చ్చిన పుణ్యుడు గాంచు నాక * చిరసౌఖ్యముల్ ॥

* తాంబూల దానము. *

క॥ నిరతంబును తాంబూలము * ధరణీసురవరుల కిడిన * ధర్మాత్ముల కే
నరుదారనొసగుదు నుకృప * నిరుపమ సుశ్రీలు పొందు * నృపవంశమణి ॥

* దధి తక్ర మధ్వాజ్య దానము. *

క॥ ఇలశుచియగు దధితక్రం * బులు తేనెయు నెయ్యి నెయ్యి * మునవిప్రున కే
యలఘుమతి నొసగునతనికి * తలపం గాపమృత్యుభయము * తాకోనని చెప్పుదుర్

* నారికేళఫలదానము. *

సీ॥ చైత్రవైశాఖ మాసవాసరములందు । నారికేళఫలంబులు ధారుణీసు
పర్వునకునిచ్చి యప్పితృపతిసమర్చ్చి । తుండైకుభేరపురమున నుండునెపుడు ॥
క॥ మున్నూరుయుగంబులుదగ * కిన్నరపతిపీటనుండి * గిరిశునిపురిన
త్యున్నతినైదుయుగంబులు * మన్నంపగనంతబ్రహ్మ * మందున బొందున్ ॥

* శీతలోదక దానము *

సీ॥ కప్పురంబేలకులు లవంగములుగలిపి । శీతలజలంబొసగినదాతయెప్పుడు
శమనుపథమునయమృతపానమునొసర్చి । మత్పదమునొందిసుఖయించుమనుజనాథ

* మిరియాలు లవణ దానము *

క॥ వినమార్గశీర్షమాసం * బునమిరి చెంబులునులవణ * మునువిప్రులకి
చ్చినయతడుసర్వపాతక * వినిహతిగావించియింద్ర * పీఠవసించున్ ॥

* సుగంధ లేపనము *

క॥ విధుధర్మజకస్తూరి * ఘనసారసమేతమైన * గంధముభూదే
వునిమేనబూయుపుణ్యుడు * కనుగొనుదాసోమలోక * ఘనసౌఖ్యముల్ ॥

* ఫలదానము. *

సీ॥ నారికేళకపిద్ధజంబూరసాల । ముఖ్యఫలములుబ్రాహ్మణముఖ్యతతికి
దానమొనరించునట్టియాధన్యమౌళి । సూర్యలోకంబునవసించుశుభచరిత్ర ॥

* తిలగోధూమాది ధాన్యదానము. *

సీ॥ తిలలుగోధూమధాన్యమొవ్వలునుబెసలు । వడ్లునిచ్చినవాడొందు వనజగర్భు
పురినిలవణంబొసంగునప్పుణ్యమూర్తి । వరుణలోకంబున వసించువసుమతీశ ॥

* కందమూల శాక భోజనపాత్రదానము. *

సీ॥ కందమూలాదిశాకవర్గంబుభోజ । నార్హపాత్రంబులనువసుధామరులకు
నిచ్చులునొసంగుపుణ్యుండునృపవరేణ్య । కాంచనసమానభూరిసౌఖ్యములుదివిని

* పుష్పమాలికా దానము. *

సీ॥ మల్లికాజాజికేతకీపున్నపుష్ప * మాలికెలువిష్ణుపాదాబ్జమహితభక్తి
ననవిసురలకొసగుపుణ్యానుభావు । నహరహంబునుబ్రోతునేనధిపచంద్ర ॥

* నవరత్నదానము *

క॥ హరినీలవజ్రమౌక్తిక * మరకతమణిపుష్యరాగ * మణివైడూర్యో
త్కరపద్మరాగవిద్రుమ * వరగోమేధికములొసగు * వాడలఘుఁడిలన్ ॥

* సాలగ్రామదానము. *

క॥ భూమీశ యేమిజెప్పుదు * కామితసత్ఫలమునగుచు * ఘనకలుషహరం
బై మెరయునవ్విసాల * గ్రామశిలాదానమతి * జగన్నుతలీలన్ ॥

క॥ చతురబ్ధివేష్టితక్షితి * క్షితిసురునికొసఁగినఫలము * చేకూరుసమం
చితసాలగ్రామశిలా * తతదానస్ఫూర్తివలన * ధాత్రీనాథా ॥

క॥ సాలగ్రామశిలకువి * శాలములైమూమకీన * చక్రములలరున్
భూపాలనాధిపతత్సా * జాలశితుండెవ్వడతఁడె * సద్భక్తిశీలన్ ॥

క॥ యెక్కడసాలగ్రామము * లక్కజమైవెలసియుండు * నక్కడతీర్థం
బక్కడపుణ్యక్షేత్రము * బక్కడనేముక్తిగాంతు * రలవైష్ణవులున్ ॥

క॥ దానంబుసేయువేళల * మానుగనామీఁదిభక్తి * మదినిల్పినత
ద్దానమనంతఫలప్రద * మైనిర్మలసాత్వికంబు * నైఫలసిల్లున్ ॥

* దాన పాత్రత. *

క॥ ఘనుఁడుసుశీలుఁడుభక్తుఁడు * ననహంకారుండుబుధుఁడు * నగువిప్రునిచే
ననయముబవిత్రితములై * తనరుఁ లోకంబులెల్ల ధరణీనాథా ॥

* ఉపకారము. *

గీ॥ తల్లివలననుమరితండ్రివలన ♦ వితతశతకోటికులసముద్గతుఁడునగుచు
మహితగంధర్వసంస్తూయమానుఁడగుచు ♦ సత్యలోకంబునొందినిచ్చలువసించు

* సుజనులు. *

మ॥ హరిభక్తుం డుపరోపకారి । నుతవిద్యాశాలి సత్యవ్రతుం
డురుపుణ్యుండపరాపరాధ । విముఖుం డుత్కృత్స్నపామూలీను
త్సరదూరుండువిరాగియోగి । మృదుభాషాభూషణుండార్యసం
ఘరతుండుంగనబోఁడుదండధరు । లోకంబుఁ న్నృపాలోత్తమా ॥

## దానమయూఖము.

హిరణ్యదానం శ్లో॥ హిరణ్యగర్భగర్భస్థం । హేమబీజం విభావసోః
అనంతపుణ్యఫలద । మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

రౌప్యదానం యః ప్రయచ్ఛతి విప్రాయ । రజితం చాపి నిర్మలం
సవిధూయాశు పాపాని । స్వర్గలోకే మహీయతే ॥
ప్రీతిర్భవస్య పితౄణాం । విష్ణుశంకరయోస్సదా
శివనేత్రోద్భవం రౌప్య । మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

తామ్రదానం తామ్రం పుష్టికరం ప్రోక్తం । సర్వదేవప్రియం శుభం
సర్వరక్షాకరం నిత్య । మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

కాంస్యదానం కాంస్యం పరిభూః శివస్సాక్షా । త్కాంస్యమేవ విభావసు
కాంస్యం విష్ణుమయం స్మాద । మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

లోహదానం యస్మాదాయసకర్మాణి । తదధీనాని సర్వదా
లోహలాంగలాదీని । తతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

రౌప్యపాత్రదానం కన్యానృతం గవాం చైవ । పరదారప్రధర్షణం
రౌప్యపాత్రప్రదానేన । క్షిప్రం నాశం ప్రయాంతు మే ॥

తామ్రపాత్రదానం పరాపవాదపైశున్య । మభక్ష్యస్య చ భక్షణం
తతః స్థితం చ తత్పాపం । తామ్రపాత్రం చ నశ్యతు ॥

కాంస్యపాత్రదానం యాని పాపాన్యనేకాని । కర్మాణి చ కృతాని వై
కాంస్యపాత్రప్రదానేన । తాని నశ్యంతు మే సదా ॥

ఘృతపూర్ణ కాంస్యపాత్రదానం కాంస్యపాత్రే ఘృతం న్యస్య । ముఖం తత్ర విలోకయేత్
బ్రాహ్మణాయ ప్రదద్యాత్తు । తేన పాపం వ్యపోహతు ॥

తిలపాత్ర దానం దేవదేవ జగన్నాథ । వాంఛితార్థఫలప్రద
తిలపాత్రం ప్రదాస్యామి । తవాంగే సంస్థితం కురు ॥

వంశపాత్రదానం. దురడీవంశకరః ప్రోక్తో । దంపత్యోః ప్రీతివర్ధనః
తస్మాదస్య ప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

గోదానం. గావో మే అగ్రతః సంతు । గావో మే సంతుపృష్టతః
గావో మే హృదయః సంతు । గవాం మధ్యేవసామ్యహం ॥
గవామంగేషుతిష్ఠంతి । భువనానిచతుర్దశ
తస్మాదస్యాః ప్రదానేన । అతః శాంతింప్రయచ్ఛమే ॥

కృష్ణధేనుదానం. యస్మాత్వం పృథివీసర్వా । ధేనుకేశవసంభవా
సర్వమృత్యుహరాన్నిత్య । మతః శాంతింప్రయచ్ఛమే ॥

వజ్రదానం. హారకాంతి యుతో వజ్రో । వజ్రిణః ప్రియకారకః
తస్మాదస్య ప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

వైడూర్యదానం. వైడూర్యః సర్వరత్నానాం । శ్రేష్ఠః పాపహరస్మృతః
తస్మాదస్య ప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

నీలదానం. హరికాంతియుతో నీలం । సర్వపాపహరస్మృతః
తస్మాదస్య ప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

రత్నదానం. యథారత్నేషుసర్వేషు । సర్వదేవవ్యవస్థితాః
యథాశక్తి ప్రయచ్ఛంతు । రత్నదానేన మేసురాః ॥

మాణిక్యదానం. రత్నానాంప్రవరంప్రోక్తం । మాణిక్యంమంగళప్రదం
తస్మాదస్య ప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

ప్రవాళదానం. మంగళంపరమంప్రోక్తం । ప్రవాళంపల్లవోపమం
తస్మాదస్యప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

మౌక్తికదానం. స్వాతీజలసముద్భూతం । మౌక్తికంపరమంస్మృతం
తస్మాదస్య ప్రదానేన । మతః శాంతింప్రయచ్ఛమే ॥

కంబళదానం. సీతత్రాణకరంప్రోక్తం । కంబళః సర్వదేహినాం
తస్మాదస్యప్రదానేన । మతః శాంతింప్రయచ్ఛమే ॥

వస్త్రదానం. శీతవాతోష్ణసంత్రాణం । లజ్జయారక్షణంపరం

దేహాలంకరణంవస్త్రం । మతఃశాంతింప్రయచ్ఛమే ॥

గోధూమదానం. సర్వదేవమయంధాన్యం । గోధూమాఖ్యంపరికీర్తితం
ప్రాణినాంజీవనోపాయ । మతఃశాంతింప్రయచ్ఛమే ॥

ముద్గదానం. అవశ్యంసర్వధాన్యానాం । ముద్గధాన్యంపరికీర్తితం
తస్మాదస్యప్రదానేన । మతఃశాంతింప్రయచ్ఛమే ॥

మాషదానం. బ్రహ్మణానిర్మితామాషాః । పితౄణాంతృప్తికారకాః
తస్మాదేషాంప్రదానేన । అతఃశాంతింప్రయచ్ఛమే ॥

మసూరాదానం. ధాన్యేషుమసూరాఃప్రోక్తాః । మసూరాఃసుఖదాఃశుభాః
తస్మాదాసాంప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

కుళుద్ధదానం. ఆరోగ్యకారికాఃప్రోక్తా । కుళుద్ధాఃసర్వదేహినాం
తస్మాదేషాంప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

తిలదానం. మహర్షేర్గోత్రసంభూతాః । కాశ్యపస్యైతిలాస్స్మృతాః
తస్మాత్తిలప్రదానేన । మమపాపంవ్యపోహతు ॥

తండులదానం. అనేనజాయతేవిశ్వ । ప్రాణినాంప్రాణరక్షణం
తండులావిశ్వదేవత్యాః । పాకమన్నంభవంతియే ॥
పచనాసర్వయజ్ఞేషు । ప్రశస్తాఃసర్వకర్మణి
తస్మాత్తండులదానేన । ప్రీయంతేవిశ్వదేవతాః ॥

లవణదానం. యస్మాదన్నరసాఃసర్వే । అరుచాలవణంవినా
శంభోఃప్రీతికరంనిత్యం । లవణంతద్దదామ్యహం ॥
లవణాస్సర్వదేవానాం । రసానాంప్రీతికారకం
ప్రియంచవినయోర్నిత్య । మతఃశాంతింప్రయచ్ఛమే ॥

గుడదానం. యథాదేవేషువిశ్వాత్మా । ప్రవరశ్చజనార్దనః
సామవేదస్తువేదానాం । మహాదేవస్తుయోగినాం ॥
ప్రణవఃసర్వమంత్రాణాం । నారీణాంపార్వతీయథా
తథారసానాంప్రవరం । దదామిగుడమంజసా ॥

**ఘృతదానం.** కామధేనోః సముద్భూతం । సర్వక్రతుషు సంస్థితం
దేవానామాజ్యమాహారం । మతః శాంతిం ప్రయచ్ఛమే ।

**తైలదానం.** శనైశ్చరప్రియం తైలం । తిలేభ్యో జనితం శుభం
తస్మాదస్య ప్రదానేన । మమ పాపం వ్యపోహతు ॥

**అన్నదానం.** అన్నమేవ పరం లక్ష్మీ । రన్నమేవ జనార్దనః
అన్నం బ్రహ్మాఖిలం తత్ర । భవేజ్జన్మని జన్మని ॥

**క్షీరదానం.** అలక్ష్మీహరతే సత్యం । సుఖసౌభాగ్యవర్ధనం
క్షీరం మంగళమాయుష్యం । అతః శాంతిం ప్రయచ్ఛమే ॥

**దధిదానం.** దధిద్వాదధిసాపుంసః । సదా సంతుష్టముత్తమం
అతస్తత్ప్రదానేన । ఇహాముత్ర స్థిరం మమ ॥

**భూదానం.** సర్వభూతాశ్రయా భూమి । వరాహేణ సముద్ధృతా
అనంతసస్యఫలదా । మతః శాంతిం ప్రయచ్ఛమే ॥

**గృహదాన.** ప్రాజాపత్య గృహాణత్వం । గృహమేతద్ద్విజోత్తమే
ప్రయతాం మే జగద్యోనిః । సర్వరూపా జనార్దనః ॥

**శయ్యాదానం.** లక్ష్మ్యా అశూన్య శయనం । యథా తవ జనార్దన
శయ్యా మమాప్యశూన్యస్య । దానేనానేన కేశవ ॥

**ఛత్రిదానం.** ఇహాముత్రాతపత్రాణం । కురు కేశవ మే ప్రభో
ఛత్రిం త్వత్ప్రీతయే దత్తం । బ్రాహ్మణాయ సదా శుభం

**తాంబూలదానం.** తాంబూలం శ్రీకరం భద్రం । బ్రహ్మవిష్ణుశివాత్మకం
తవ ప్రసాదాద్బ్రహ్మాద్యా । ప్రియం దదతు పుష్కలం ॥

**వ్యజనదానం.** వ్యజనం సుజనం మహ్యం । సదా సర్వం శసంభవం
సపవిత్రమనేనైవ । తాపం హరతి దేహినాం ॥

ఇ తి దా న మ యూ ఖే

—(*) తత్త్వము. (*)—

*పల్లవి.*

దొరవాఁ డెగూరుచున్నాఁడూ । సా । ద్గురునాథుఁడిదె నేఁడుజూడూ ॥

అనుపల్లవి.

సరసిజభవవిష్ణు హరులంకురములామై । సురసిద్ధసాధ్యులు స్తుతులుశాయఁగనేఁడూ ॥

*చరణములు*

రక్తశ్వేతకృష్ణరస్యముగ పీత । యుక్తసిలములాంపై ముక్తికాంతనుగూడి॥ దొ ॥ ౧ ॥

పదహారుపత్రంబు పదియారు నాల్గుపై । కుదురు జేసుక తాను ద్విదళమధ్యమున దు॥ దొ॥

పాతాళమునకాగ్ని వాతాంబరములాపై । ఖ్యాతిగగురుపరంజ్యోతిస్వరూపామై ॥దొ॥

అక్షులనడుమ ప్రత్యక్షమైజనులాను । మోక్షమునొసగూచు సాక్షాత్కారముగాను ॥

పరమానందముగాను పరశూరామునివర । నరసింహ్వయోగిహృత్సరసీరుహమునందు॥

*కందార్థము.*

(గీ) * మెరుకన్నమరుపన్నను * మెరుకకుమెరుకన్న దేహి * యనమాయ యనక * గురుతనసాక్ష్యనజ్ఞప్త్యన * స్ఫురణయనక ద్రష్టయనిన * చూడుమొక్కటిగా * యిదిలేకుంటే * చూడమొక్కటిగా * మరిచలాచలమూల మర్మమోగెటిదన్నా * యోగితాలేనాస * యెగిరిపొవ్యెటిదగ్నా * చూడుమొక్కటిగా * యిది లేకుంటే * చూడామొక్కటిగా ॥ * * * *

*భద్రాద్రిరామశతకము.*

సీ॥ చైతన్యమునియన్న క్షేత్రజ్ఞుఁడనియన్న * జ్ఞానముయన్న హంకారమన్న
సద్రూపమనియన్న చిద్రూపమనియన్న * స్వస్వరూపంబన్న సాక్షియన్న
ఈశ్వరుఁడనియన్న యిలవిష్ణువనియన్న * పరమాత్మయనియన్న బ్రహ్మమన్న
యాదిశక్తియనియన్న యానందమనియన్న * పరమపదంబన్న ప్రకృతియన్న

గీ॥ మాయకేయున్నబహునామధేయములును * బట్టబయలందునొక పేరుబుట్టలేదు
రమ్యగుణధామ భద్రాద్రిరామపరశు * రామనరసింహ్వదాససంరక్షితాంహ్వ

## * భావార్థము. *

గు॥ * చైతన్యమన్న, క్షేత్రజ్ఞుడన్న, జ్ఞానమన్న, అహంకారమన్న, సద్రూపమన్న, చిద్రూపమన్న, స్వస్వరూపమన్న, సాక్షియన్న: ఈశ్వరుడన్న, విష్ణువన్న, పరమాత్మయన్న, బ్రహ్మమన్న, ఆదిశక్తియన్న, ఆనందమన్న, పరమపదమన్న, ప్రకృతియన్న, యీమొదలైన పరినామములు మాయకేగాని, బట్టబయలుకు లేదు.

| * పంచశృంగాలు. * | * పంచశక్తులు. * |
|---|---|
| ౧ శివరూపం. | ౧ శివునికి పరాశక్తి. |
| ౨ అమూర్తిరూపం. | ౨ అమూర్తికి ఆదిశక్తి. |
| ౩ మూర్తిరూపం. | ౩ మూర్తికి ఇచ్ఛాశక్తి. |
| ౪ కర్తారూపం. | ౪ కర్తకు జ్ఞానశక్తి. |
| ౫ కర్మరూపం. | ౫ కర్మకు క్రియాశక్తి. |

## * కందార్థము. *

౭౦ * అనుమానముమదిసుంచక * వినువింకనుమెరుకపేర్లు * వివరించెదబు* ధ్యానచిత్తంబనమానస * మనసనహంకారమనిన * నంతఃకరణనినర్ * సంకల్పమం* చనినాంఇచ్ఛనిర్ * తనవితరులనేతానని గురెరెగటిదన్న * తననేకానితరాల * తనను దెలిసెటిదన్న * నంతఃకరణనినర్ * సంకల్పమం * చనినాయిచ్ఛనినర్ ॥

కం॥ మానసముదేహిజీవుం * డానందముసత్తుచిత్తు * లహముజగదధి
ష్టానంబుసాక్షిసత్య * జ్ఞానముద్రష్టనినసీవె * సత్యముసుజ్ఞా ॥

—( * ) శ్రీ శివరాదీక్షితీయమను బృహద్వాశిష్ఠం. ( * )—

## * అచలబోధసిద్ధాంతం. *

గు॥ యీశరీరం వొక్కటేకాని । దీనిలోపట వున్నపేర్లు అనేకాలు । జ్ఞానంఅని । అజ్ఞానంఅని । యింద్రియాలుఅని । విషయాలుఅని । గుణాలుఅని । అంతఃకరణ అని । మనసుఅని । బుద్ధి అని । చిత్తమని । అహంకారమని । వేదాలుఅని । శాస్త్రాలు అని । యన్నియన్ని వ్రాతు । యీశరీరమందు । స్వగత భేదాలు । అనంతాలువున్నవి । తీశివేశినాకొద్ది మొలుస్తావి । వున్నవాటికి లెక్క లేదు ।

పోయినవాటికి లెక్క లేదు । వ్రాయ శక్యం కాదు । స్వజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యమైంది । యీబట్టబైలు । యీబట్టబైలుకు బయలు లేదు । యీ బట్టబైలుకు శరీరంలేదు । గనక । స్వగతభేదాలు యున్నటికీ లేవు । యేమీ లేని బట్టబైలులో । యేమీలేక వున్నవారు । పరిపూర్ణులు । యీశరీరం వున్నంత శేపూ । కలే । కాని । మరివొకటిలేదు । అందరూ స్వప్నావస్థచాతనే వున్నారు । జాగ్రతఐతే నేకల । జాగ్రత లేకమునుపు । యీశరీరం యేమీ లేదు । గనక । వ్యవహారమే లేదు । వ్యవహారానకు మూలం గురుతెరిగేజ్ఞానమే । కాని । మరిహోటిలేదు । గురుతెరిగేజ్ఞానం పుట్టగానే కలశిద్ధం । యీకల లోనే । అనేక చిత్రవిచిత్రాలు పుట్టుచావి । వెంటనే యేమీ లేదు । యంతవారు కలకంచూ వున్నారు । కల గాకమునుపు । " మూలంలేని యీగురుతెరిగేశరీరం యేమీ లేదు. " । గనక । మొదలుకొనా లేని బట్టబైలు । తనకుతానే । స్వతశిద్ధమై చలించక వున్నది । సార్వకాలం శరీరం లేకనే వున్నది । కనక । వక్కటైనా వికారం లేదు । శరీరం లేకవున్నదే క్రియాశూన్యం । క్రియాశూన్యంగనక కనే । పుణ్యకర్మాలు లేవు । పాపకర్మాలు లేవు । శరీరంలేని యీబట్టబైలు । చెయ్యాచెయ్యదు । చేయించా చేయించదు । సార్వకాలంవొక్కతీరే ॥

గద్య॥ ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
భ్రాంతి రహిత ప్రకరణం.

## కోశప్రతికోశ వివరణం.

పార్వత్యోవాచ— శ్లో॥ కథంకోశాత్మకంజ్ఞానం । ప్రతికోశంకథంవిభో
కోశాతీతంచకోశంచ । కథయస్వమహేశ్వర ॥

ఈశ్వరోవాచ— శ్లో॥ కంఠాదధస్థపిండంచ । ఊర్ధ్వేబ్రహ్మాండమేవచ
ద్వాదశేమూర్ధ్నిస్థానాని । దశాంగుళమితిక్రమాత్ ॥

సభూమింవిశ్వతోవృత్వా అత్యతిష్ఠద్దశాంగుళం । ద్వాబాహూద్వాచపాదాచ

స్థూలదేహత్రినిశ్చితం । ఘంటికాశిశ్చ సుంగుష్ఠం లింగశ్లోకే ప్రతిష్ఠితం । అంగు
ష్ఠమాత్రః పురుషోం గుష్ఠంచ సమాశ్రితః । ఈశస్సర్వస్యజగతః ప్రభుః ప్రీణాతి
విశ్వభుక్ । నాభిరూర్ధ్వమధఃకంఠా ద్వాదశస్తిద్వయపూరితం । స్తనేకర్ణే తథా
హృద్యే కారణేకోశమాశ్రితః । అంగుష్ఠమర్థపర్వంచ కారణే దేహసమ్మితం ।
నాభిచమూలనాభీస్యాత్ చతుర్థః పరిగీయతే । ప్రమాణమసురంచైవ మహా
కారణదేహగం । రక్తపీతంచ శ్వేతంచ శ్వేతరక్తస్తుకజ్జరం । రక్తశ్యామ
స్తథాభేదం కృష్ణయుక్తంసునీలతః । అజామేకాంలోహితశుక్లకృష్ణాం బహ్వీం
ప్రజాంజనయంతీగ్ంసరూపాం । అజోహ్యేకో జుషమాణోనుసేతే జహాత్యే
నాంభుక్తభోగామజోన్యః । రక్తపీతంచ సంయుక్తం అకారఘుతిసంజ్ఞికం । శుక్ల
కజ్జరతాంచైవ ఉకారేతిప్రతిష్ఠితం । రక్తశ్యామద్వయోభేదం మకారంతు
శివస్వయం । నీలాసునీలతాంచైవ ధ్వనిరూపార్ధమాత్రకా ॥ ఇదందేహ చతు
ష్టయం గురుకృపాచలభ్యతే ॥ ఇదంజ్ఞానమయోపేతం వేదార్థంగుహ్యవిస్తరం
ఓంకారముచ్చార్యవిలోక్యదేహం అంతఃశరీరేనిహితంగుహాయాం । ఇదంరహ-
స్యంమమయేవకీర్తితం సవేదనీయ్యంగురురేవకేవలం । శుద్ధపీతంచ శూన్యంచ
శూన్యాశూన్యవివర్జితం । నవవర్ణాత్మకంభేదం యోజనాతిసబాహ్యాః ।
అన్యథా సర్వవేషాచ విడంబికేపరివృతః । శిశ్నోపస్థద్వయంగ్రాహ్యం నజా
నాతిమూలాన్వయం । సర్వాతీతశ్చపీతశ్చ సర్వసామర్థ్యమేశచ । నవకం
రంగభేదేన యోజనాతీహస్వయం । త్రీణ్యర్థవిదితిదంచైవ స్థూలంతారక్తవ-
ర్ణకం । నేత్రస్థానేనదృశ్యంతి జాగ్రత్వావస్తయాతథా । రూపంరూపంచరూ-
పంచ ప్రతిరూపోబభూవథ । తదస్యరూపంప్రతిచక్షణాయ ॥ ఇంద్రోమా
యాభిఃపురురూపఇయతే ॥ యుక్తాహ్యస్యహరయః శతాదశ । అంగుష్ఠమర్థ
పర్వంచ లింగదేహంచదృశ్యతే । అవయవరహితంథామా స్వప్నావస్థాతథై-
వచ ॥ హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్యజాతఃపతిరేకఆసీత్ । సదా
ధారపృథివీంద్యాముతేమాం కస్మైదేవాయహవిషావిధేమా । కారణంఅర్థప-
ర్వంచ తమఅజ్ఞానమేవచ । సంహ్వారమథకారంచ కృష్ణవర్ణంసుషుప్తయే ।

తమఆసీత్తమసాగూఢమగ్రే ప్రకేతంసలిలం సర్వమా ఇదం ॥ అతసీపుష్పసం
కాశం త్రిణిమధ్యేవ్యవస్థితం । దృశ్యతేబిందుమాత్రేణ మహాకారణముచ్యతే।
ఏకఏవహిభూతాత్మా భూతేభూతవ్యవస్థితాః । ఏకధాబహుధాచైవ దృశ్యతే
జలచంద్రవత్ । నీలపీతమిదంవర్ణం కారణాదూర్ధ్వకారణాత్ । మహాకా
రణనామంచ తుర్యావస్థాచఉన్మని । "నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవభా
స్వరా । నీవారశూకవత్తన్వీపీతాభాస్వత్యణూపమా । తస్యాశ్శిఖాయామధ్యే
పరమాత్మావ్యవస్థితః । సబ్రహ్మసశివస్సహరిస్సేంద్రస్సోక్షరః పరమస్స్వరాట్ "
వాలాగ్రశతసహస్రస్య తస్యభాగస్యభాగతః । తస్యభాగస్యభాగార్ధం తత్త్వ
జ్ఞేయంనిరంజనం । "యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ ఆనందం
బ్రహ్మణోవిద్వాన్ నబిభేతికుతశ్చనే" ॥

ఇతి శ్రీరుద్రయామళే ఉమామహేశ్వర సంవాదే శ్లోకప్రతిశ్లోకవివరణం సంపూర్ణం.

* కందార్థము. *

(౬౧) * విమలితరులు మెరుకనుసా * ష్క్యనిఖలికిరి నేనుసాక్షి * సహమనినీతో
విన జెప్పితి నీతియె వే * రనగూడదు రెంటినొక్కటి * టని తెలుసుకోరా * మాటలభేద
మనికనుకోరా * అనరానివినరానికనరానిబయులందు * తనకైతానసుదెంచి * తనకై
తాజనునీసా * ష్క్యని తెలుసుకోరా * మాటలభేదమని * కనుకోరా ॥ * *

కం॥ ననురమ్మనిపొమ్మనితా * ననదుసుమీబట్టబయులు * నాకై నేనే
తనువునుజగమును కైకొని * చనుదెంచుట చనుటనాకు * సహజముతండ్రీ ॥

* కందార్థము. *

(౬౨) * వన్నియనైనొకచోటను * పన్నగగలసినదిహృదయ * పద్మంబనుచున్
మెన్నదురుజనులుమెరుకం * దున్నాదనిశ్రుతులు బల్కుచున్నా విసుమీ * తెలసుకొ
మోక్షమన్నా విసుమీ * వన్నెలన్నియుమీరియున్నా వస్తువజాడా * నెన్నా డెరుంగక
మెన్నోరీతులబల్కు * చున్నా విసుమీ * తెలసుకొ మోక్ష * మన్నా విసుమీ ॥

—(*) శి ద్ధ శి ద్ధాం త ద్ధ తి. (*)—

శ్లో॥ రక్తంశుక్లంతథాకృష్ణం ♦ నీలపీతాదిశోభితం
తన్మధ్యేదర్శితంయేన ♦ తజ్యోతిర్బ్రహ్మకేవలం ॥

(*) స్వ రూ ప ని ర్ణ య ం, తా ర క స్థా న ము. (*)

లక్ష్మణోరక్తవర్ణశ్చ ♦ శతృఘ్న శ్వేతవర్ణకః
భరతఃకృష్ణవర్ణశ్చ ♦ శ్రీరామోనీలవర్ణకః
వైదేహీపీతవర్ణాన ♦ తారకఃస్ఫటికాకృతిః॥

శ్లో॥ రక్తంశ్వేతంతథాకృష్ణం ♦ నీలపీతాదిశోభితం
తన్మధ్యేవ్యాపితంజ్యోతి ♦ స్తజ్యోతిర్బ్రహ్మకేవలం ॥
విఘ్నేశోరక్తవర్ణశ్చ ♦ వీరభద్రశ్చపాండురః
క్రౌంచారిధూమ్రవర్ణశ్చ ♦ సునీలోనందికేశ్వరః ॥
గిరిజాపీతమిత్యాహుః ♦ శివోజ్యోతిఃప్రకీర్తితః
శివోహమితినిశ్చిత్య ♦ ఏతత్సర్వంపరిత్యజ ॥
నమఃశబ్దోభవేజ్జీవో ♦ శివఃశబ్దఃశివోభవేత్
యఃశబ్దఃద్వయసంయోగః ♦ శివోహమితినిశ్చయః ॥

—(*) మ ం త్ర పు ష్ప ం. (*)—

శృతి॥ పద్మకోశప్రతీకాశగ్ం। హృదయంచాప్యధోముఖం। అధోనిష్ట్యావితస్త్యాంతు నాభ్యాముపరితిష్ఠతి। జ్వాలమాలాకులంభాతి। విశ్వస్యాయతనంమహత్। సంతతగ్ంశిలాభిస్తులం బత్యాకోశసన్నిభం। తస్యాంతేసుషిరగుమ్సూక్ష్మం। తస్మిన్సర్వంప్రతిష్ఠితం। తస్యమధ్యేమహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః। సోగ్రభుగ్విభయన్ తిష్ఠన్నాహారమజరఃకవిః। తిర్యగూర్ధ్వమధశ్శాయి : రశ్మయస్తస్యసంతత। సంతాపయతిస్వందేహమాపాదతలమస్తకః। తస్యమధ్యేవహ్నిశిఖా అణీయూర్ధ్వావ్యవస్థితః ॥

(*) శ్రీ శివరామదీక్షితీయమను బృహద్వాశిష్ఠం (*)

* అచలబోధసిద్ధాంతం. *

కారణతను నిరసన ప్రకరణం,

—* సచ్చిదానందలక్షణము. *—

గుర్తెరిగేయెరుక సచ్చిదానందం। అదే కన్నులయందున్నది। చూచేది సచ్చిదానందం। గనుక। నేను యెరుగుదును అనిఅనుభవంవున్నాది। గనుక। నేనే సచ్చిదానందం। యీసచ్చిదానందమే పరదేవత అనే అమ్మవారు। సర్వాన్ని గుర్తెరిగే అమ్మవారు। గనుక। సప్తకోటిమహామంత్రస్వరూపిణి। అనివున్నాది। గనుక। సర్వార్థధాత్రి। సావిత్రి। సచ్చిదానంద స్వరూపిణి। అనివున్నాది। గనుక। గుర్తెరిగే సచ్చిదానందస్వరూపులే। అందరు। యీ యెరుకే అన్నికులాలు। అదేలంటే। యెరుకతోటే। అందరూ నేనుఫలాని వాణ్ణే అని అంటారు। గనుక। అందరూయెరుక స్వరూపులే। గనుక। యీ గుర్తెరిగే సచ్చిదానందం వుండేనా అందరూనిబద్ధే। యీగుర్తెరిగేసచ్చిదానందం లేకపోయనా అందరూలేరు। తనకుతానే స్వతస్సిద్ధమైవున్న। అచలమనే పరిపూర్ణానకు। యెరుకాలేదు। మరుపూలేదు। గనుక। ఆపరిపూర్ణమే దేహాకారం గాకవున్నాది। గనుక। వికారంలేదు। గుణాలులేవు। యింతకంటే యెక్కువలేదు। యీశరీరం పుట్టకమునుపే। తనకుతానేస్వతస్సిద్ధమై వున్నది। అచలం గనుక। యెన్నటికీ చెలించదు। దేహాకారం గాక వున్నాది గనుక। యెరుకలేదు। మరుపులేదు। వున్నది వున్నట్టే వున్నది। సార్వకాలంవొక్కతీరే। వున్నదివున్నట్టు తెలిపే గురువు కలతలేనిగురువు కావలె

* మతాలలక్షణం. *

గురువు యెరుకస్వరూపం అయివుండెనా। అరుంధతితండ్రిసాంప్రదాయం వారే। వసిష్ఠాదులనలె। ఋషీశ్వరులు కర్మయోగులు। కొందరు శుకుల వంటి విరక్తులు। జ్ఞానులు మునీశ్వరులే। జ్ఞానకర్మ రహితమైన శుద్ధమార్గం వారుకారు। వశిష్ఠాదులే బ్రాహ్మలకు మూలము। వారి సాంప్రదాయ

వారికే యెరుక । శాస్త్రం లేక నడిచేవారే బాధ్యులు । నులక చందయ్య చిన్నయ్యగారే శైవులు । అప్పయ్య దీక్షితులవారు వారి భక్తుడవ । వారిది బసవన్నగారి కులమే । గనుక । రామానుజాచార్యులవారిది బసవన్నగారి కులమే । మారునూరి నంబిగారి శిష్యుడవ । తిరుపణ్యాళ్వార్లగారి భక్తుడవ । మాలవారైనాగాని । మహా పెద్దలవ । వసిష్ఠాదులతో సమానం । శ్యామలా శక్తి తంత్రి గనుక । కొంతమంది బుషులు ఆ సాంప్రదాయంవారు । వారే శాక్తేయ మతంవారు । శక్తి వున్నదని అనుకునేవారు కొందరు చార్వాకులు సూర్యుడే దేవుడని నమ్మివున్నారు । యీ షణ్మతాలవారు । కులం చెడ్డ పతీతులే । యీ షణ్మతాలవారే వర్ణసంకరులు । బ్రాహ్మణుడు సత్యమైతే । క్షత్రియుని యొక్క అన్నం యేలాగు తినే । శృతి ॥ " ఆర్యాధిష్ఠితావా శూద్రాః " అనివుండె । " ఆర్యాః ప్రయతాః వైశ్వదేవేంసగుమ్ స్కర్తారస్స్యుః । ఆర్యాః త్రైవర్ణికాః " అనివుండనేవుండెగదా । శాస్త్రం చేతనే కులం చెడేది । శాస్త్రం చేతనేగు తెలిరిగే జ్ఞానమే చైతన్యం । సర్వంగు తెలిరిగే జ్ఞానమే చైతన్యం । చైతన్యమే క్షేత్రజ్ఞుడు । వాడే సచ్చిదానందస్వరూపమైన ఆత్మ । వాడేపురుషుడు । వాడే ఆత్మ వాడే ఈశ్వరుడు । వాడే సర్వాన్ని గు తెలిరిగేవాడు గనుక సర్వజ్ఞుడు । వాక్క దేహంలో జ్ఞానం కించజ్ఞరాలు । వాడే కించజ్ఞుడు । కర్మప్రతిపాదక శాస్త్రానకు బహులు । జ్ఞాన ప్రతిపాదక శాస్త్రం । జ్ఞానంవలన కర్మ పుడుచుంది । కర్మ ద్వారా జ్ఞానోదయం అనేవారివెట్టి యేమని చెప్పవచ్చును । జ్ఞానమే కర్మం చెయ్యమని బోధించే వేదశాస్త్రాలు । గురువులు రెండూ వెట్టి । గు తెలిరుగుటం చేత కర్మంపుడుచుంది । గు తెలిరిగే జ్ఞానమే సర్వార్థములు । నేను నేను అని ప్రవర్తించేది స్వతస్సిద్ధమైన జ్ఞప్తి । అదే బ్రహ్మస్వరూపం । అదే ఆత్మ । అదే జీవుడు । అదే ఈశ్వరుడు । గు తెలిరిగే జ్ఞానానకే సకలఉపదేశాలు చెప్పేది జ్ఞానం । చూచేది జ్ఞానం । వినేది జ్ఞానం । అది యెవరు । యెరుగుదురో । వారు యేమి చేస్తారు । యేమి విడుస్తారు । జ్ఞానమే లోపట బైట వున్నదని చెప్పడం । అజ్ఞానం మిథ్య అని తెలిస్తే దేనిలోపట దేనిబైట । అంతర బాహ్యాలు కల్పితం ।

బట్టబయలు దేహములో వొచ్చిందా వెళ్ళిపోతుందా । అన్నితిప్పలు । యీగు తెఱరిగేమాయకే । దానిమహిమ యేమని చెప్పవచ్చును । వున్నదంటేవున్నది। చూస్తే లేదు । గురూపదేశానంతరం లేదు । మహావాక్యోపదేశం । యెవరికి చెయ్య । అది జ్ఞానప్రతిపాదకమే । జీవేశ్వర ప్రతిపాదకం । తదాతీతంనిజం । యెరుకలేనిఘట్టి యెవరికి కలదో వారు శుద్ధపురుషులు । వారేవారు । జ్ఞానులు కారు । అజ్ఞానులుకారు యీ దేఉపదేశం । అద్వైతం మిథ్య । జ్ఞానస్వరూపము గనుక । అనృతవాక్యంనమ్మినవారికి కద్దు । సంశయంలేదు ॥

* యెరుక లక్షణం. *

కన్నులయందువున్నది యెరుక । అది మాయవ్యాపించి దానికి సమస్తనిర్ణయాలతో చెప్పబడ్డది । దానికే । జ్ఞానమనిఅన్నా । చైతన్యమనిఅన్నా । జ్ఞప్తి అనిఅన్నా । క్షేత్రజ్ఞుడుఅనిఅన్నా । అవిద్యఅనిఅన్నా । ఈశ్వరుడుఅనిఅన్నా । మాయఅనిఅన్నా । జీవుడుఅని అన్నా । ఆత్మఅని అన్నా । ప్రకృతిఅనిఅన్నా పరబ్రహ్మమనిఅన్నా । సచ్చిదానందమనిఅన్నా । స్వరూపమని అన్నా । పరిపూర్ణమని అన్నా । మహా లింగమనిఅన్నా । ఆదినారాయణుడుఅని అన్నా । హంకారమనిఅన్నా । జ్ఞానమయమనిఅన్నా । యిటువంటి మాయకే పర్యాయనామాలు ॥

* జ్ఞాన బీజ లక్షణం. *

దానియందు । పెద్దలు । పిన్నలు । యోగులు । భోగులు । జ్ఞానులు । కర్ములు । మానులు । ఋషులు । దొరలు । దొంగలు । రాజులు । భృత్యులు దిగంబరులు । సన్యాసులు । వ్యాసాది మహా మునులు । దశావతారాలు । బ్రహ్మ విష్ణు మహేశ్వరులు । ముప్పైమూడుకోట్ల దేవతలు । బ్రాహ్మలు । మాదుగులు । అష్టాదశవర్ణాలు । సంధ్యావందనాలు । నిత్యనైమిత్తికాలు । కర్మాలు । ప్రతివిద్యాదికజడాలు । కించిజ్ఞత్వాలు । సర్వజ్ఞత్వం । జనన మరణాలు । సుఖదుఃఖాలు । ద్వైతాద్వైతాలు । భేదాభేదాలు । కర్మాకర్మాలు జ్ఞానాజ్ఞానాలు । నానామతాలు । నానా వర్ణాలు । నానా నిర్ణయాలు ।

భక్తమహేశ్వరులు । నిమిత్తమైన దాసత్వాలు । గురువులు । శిష్యులు । మహాత్ములు । చిత్రవిచిత్రమైన స్వరూపాలు । పాపపుణ్యాలు । బంధమోక్షాలు । సకలసంశయాలు । సకలనిశ్చయాలు । గుర్తెరిగేజ్ఞానబీజమందులంతా చెప్పబడ్డది

* బీజనిరసనలక్షణం. *

యిందులోపల చెప్పబడ్డది । ఒకటి వుంటె ఒకటిలేకపోదు । అటుగనుక । అనేక జన్మాలయొక్క । గురుభక్తినిష్ఠ ఫలప్రాప్తిచాతను । యీ బీజం । నిరసనం చేసే సద్గురువుతావుకుపోయిన । అన్నిటికిమూలం అయింది యేదో దాన్ని లేకుండా చూచి చేస్తారు । చేసినంతలోనె । యీ చంచలమనేది । నాశనమై । యెక్కడ చూచినా అచలమే వుండె । యిది యేమిఅని । అడుగుదామంటె । అడిగేటందుకు తాను లేడు । చెప్పేటందుకు గురువులేడు । అచలం మాత్రం వుండె । దానికిరాకడలేదు పోకడలేదు । దానికి మొదలులేదు కొనాలేదు । దానికి పుట్టుక లేదు చావులేదు । దానికిజ్ఞానం లేదుకర్మం లేదు । దానికిపుణ్యం లేదుపాపంలేదు । దానికిజన్మం లేదు మరణంలేదు । దానికి సుఖంలేదు దుఃఖం లేదు । దానికి బంధం లేదు మోక్షంలేదు । దానికికించిజ్ఞత్వంలేదు సర్వజ్ఞత్వం లేదు । దానికినిశ్చయంలేదు సంశయంలేదు । జ్ఞానంలేదుగనుక యిన్నినిబంధనాలు । యీగుర్తెరిగేదానికే । సకలనిబంధనాలకుమూలమైన । గుర్తెరిగేశరీరము యేమిలేకుండా చూచెనా । పుట్టనిచావని అచలమేస్వతస్సిద్ధమైవున్నది

శ్రుతి ॥ " నజాయతే నవిద్యతే । అచ్ఛేద్యోయం అదాహ్యోయం "

నిజగురు కరుణా కటాక్షం । సంపూర్ణమైనవారికి । సార్వకాలం ఏకాకారస్థితే

ఇతిగద్య ॥ శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే

* కారణతను నిరసన ప్రకరణం. *

* కందార్థము. *

(౬౩) * చులుకనియుక్తి కనొక్కటి * తెలివెరవిను సందియంబు * దీరును వీనక పలుకున గలిగినయర్థము * పలుకునువిడనాడినిల్వ బహుచోటింకేది * రెండుగనొక్క పలుకేలయినాది * తెలి యుమిరాలాగూనా * తెలివిదేహములయ్యె * తెలివేతనువును బాశి * తెలివిస్థిరముగనిల్వ * బహుచోటింకేది * రెండుగనొక్క * పలుకేలయినాది ॥

* కందార్థము *

(౮౪) * ఎన్నకైన భూతములని * వెరుగుము ఆకసముగాను * యింగలమున నీ * ల్లిరవొంద నేలయునే * నెగిన పద్ధతినిసీను * యెరిగించినాను * ముజ్జగములవ్యైను వీట్లతోనూ * పరిపూర్ణమందు * కన్పడుచు తమరుదామే * మరికానరావిట్టి * మార్గముగలవీటి * నెరిగించినాను * ముజ్జగమూలమ్యైను * వీట్లతోనూ ॥

(గురు శిష్య సంవాదము)

కం॥ అతులితమైవిలసిల్లెడు * పృథివిమహాతత్వమహిమ * పొందుగహితసం
మతిచతురతకృతివినుమి * స్మృతిగతి నెరిగింతు దెలియ * సూనృతముఖ్యా॥

చ॥ అచలమనంతమై ప్రవిమలాధరమై నమితప్రమాణమై
సువిరతరాశ్మమై నిరతసుస్థిరమై చిరకాలజీవమై
సచరచరామర్త్య నిఖిలసంఖ్యమహాపశుపక్షిమానవా
నిచయమదీప్సితార్థముల నిచ్చుచుబ్రోచుమహీనిజాత్మకా ॥

సీ॥ చక్రవాళాదివారధిసప్తకమును ♦ సప్తశైలంబులును వృక్షసఘములును
నాదిగాగల్గురూపంబులన్నిధరణి ♦ తాల్మితో మోచుచున్ బ్రోచు ధన్యచరిత ॥

వ॥ శిష్యా యిద్ధరాతలంబునకు శబ్ద స్పర్శ రూప రస గంధంబులను గుణం
బులు గల్గియుండు పవనాకాశాగ్ని కణంబులనియెడి తత్వ చతుష్టయంబునుం
దనమీద దాల్చుకయుండు గావున నిమ్మహా పృథ్వీతత్వంబునకు సమానం
బెద్దియు లేదు మని మరియు నిట్లనియె॥

చ॥ దనరుచునుండు నాసలిల ∮ తత్వమహాత్మ్యమెరుగజెప్పెదన్
వినుమున భూంతరంబునను ∮ విశ్వతలీలమహాష్టదిక్కులన్
యెనసియు మేఘసంగతిజరింపుచు ∮ దావరుపించు ధారుణిన్
ఘనతరలీలగూడి సనఘాత్మక ∮ సర్వజలప్రవాహమై ॥

కం॥ పుణ్యాత్మక వినుధారుణి * పుణ్యమహానదులనిండి * పూర్ణంబుగస
త్పుణ్యక్షేత్రములనందరి * పుణ్యులగా జేయుచుండు * బుధనుతచరితా ॥

వ॥ నట్లుగావున నజ్జలమహాతత్వంబునకు శబ్దస్పర్శరూపరసంబులనియెడి చతు
ర్గుణంబులుగల్గియుండు నదియునుంగాక ॥

తరలి॥ అనలతత్వమహత్త్వముఁ ♦ బరమానురాగమనంబునన్
వినుములోకమహాంధకార ♦ సవిస్తరంబులణంచుచున్
ఘనతరంబుగరూపముల ♦ ననఘాత్మతోయరసంబులన్
జనమనోహరసర్వమోహహృతి ♦ జేయుపావకమూర్తిదాన్ ॥

వ॥ అట్లుగావున నఖిలపాపహరంబైన నిమ్మహాతేజస్తత్వంబునకు శబ్దస్పర్శరూపంబులన్నియెడి గుణత్రయంబు గలిగియుండు నదియునుంగాక ననిల మహాతత్వంబెరింగించెద నాకర్ణింపుము ॥

కం॥ ఆకారియుదాకాకని * రాకారముతోడదూపు * లాడింపుచును
ల్లోకానీకములనుగల * సాకారులద్రింపుచుండు * సత్యాత్మనిధీ ॥

కం॥ గావుననమ్మారుతమును * జీవాత్మనుగూడినిఖిల * జీవాంగములన్
కేవలగతినాడించున్ * భావకమైయుండునట్లు * పరమవివేకా ॥

వ॥ అట్లాగావున నిఖిలరూపవ్రాతంబుల బాహ్యాభ్యంతరంబుల నిండియుండు నమ్మహానిలతత్వంబునకు శబ్దస్పర్శ గుణద్వయంబు గలిగియుండు నదియునుంగాక ॥

గీ॥ గగనతత్వప్రభావమాకాంక్షవినుము ప్రళయవహ్నులకునుమహాప్రళయఘోర
వారధులకునుతత్ప్రళయవాయువులకు ♦ చేతనంబిచ్చిసాక్షియై చెలగుచుండు ॥

కం॥ నానాజగములనిండియు * నానావిధశబ్దములను * నభతత్వముతో
కోన్నతమైవిలసిల్లెను * ధీనిధివివరించినీకు * దెలిపితివత్సా ॥

గీ॥ వినుసదాచారవిజ్ఞానవిమలధీర ♦ అనుభవాద్యంతసిద్ధాంత మధికశాంత
ఘనతరంబగుబ్రహ్మాండఘనపదంబు ♦ నందుపిండాండముద్భవంబయ్యెననఘ ॥

* గద్య. *

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వ
శక్తిద్వయనిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత
ప్రకాశిక యందలి యెరుకలక్షణంబను చతుర్థోధ్యాయము.